# అందరికీ నమస్కరించి.....

ప్రకటనదారుల ప్రోత్సాహంతో ; రచయితలు,
భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి ఆశీస్సులతో ; చందాదారులు,
స్పందన ప్రింటర్స్, విజయవాడ ఆఫ్‌సెట్ ప్రింటర్స్‌ల సహకారంతో ఈ సంవత్సరం 12 శ్రీవాణి సంచికలు సకా
లంలో పాఠకులకు అందించగలిగాను. వారలకు నా కృతజ్ఞతలు. కాగితం రేట్లు, పోస్టల్ రేట్లు కూడా పెరిగిపోతు
న్నాయి. ఇటువంటి తరుణంలో ఉత్తమ సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక, విద్యా పత్రికను నడపడం బహు
కష్టమవుతున్నది. ఆత్మీయులు, అనుభవజ్ఞులు వద్దని ఎంత చెప్పినా వినకుండా ఈ సాహసానికి పూనుకున్నాను.
రానున్న కష్టములు, ముందుగానే తెలుసుకొని దిగాను కాబట్టి విచారించడం లేదు. ఎటువంటి పరిస్థితులలోను
ఈ ప్రయత్నాన్ని విడనాడను. ఈ పత్రిక ద్వారా లాభాలను గడించాలని భావించడం లేదు. అయితే నష్టం రాకుండా
పత్రికను క్రమం తప్పకుండా సకాలంలో అందించడానికి తాపత్రయ పడుతున్నాను. ఎన్ని జాగ్రత్తలు తీసుకుంటున్నా,
ఎడిటింగ్ దగ్గరనుండి డిస్పాచ్ వరకు ఉద్యోగులను పెట్టకుండా అంతా స్వంతంగానే చూచుకుంటున్నా నష్టముల బారి
నుండి తప్పించుకోలేక పోతున్నాను. ఈ సంవత్సరం నష్టం అంచనా షుమారు 9 వేలదాకా ఉంటుంది.

వారందరూ పంపుతే కొంత నష్టం పూడటా
చందాలు రెన్యూవల్ చేయవలసినవారు వందల సంఖ్యలో ఉన్నారు.
నికి అవకాశమున్నది. సహృదయంతో సహకరిస్తారని ఆశిస్తున్నాను. కొంతమంది పెద్దలకు, ఆత్మీయులకు పత్రిక
ప్రారంభం నుండి పంపుతున్నాను. అందులో కొంతమంది జీవిత సభ్యులుగా చేరి చేయూత నిచ్చారు. వారికి
ధన్యవాదములు. మిగతావారు కూడా జీవిత సభ్యులుగా చేరి ప్రోత్సహిస్తారని ఆశిస్తున్నాను. రచయితల నుండి
చందాలు కోరడం లేదు. అమూల్యమైన రచనలను మాత్రం ఆహ్వానిస్తున్నాను.

వారుకూడా రెన్యూవల్ చేసి సహకరించ ప్రార్థన. రేట్లు
ఈ డిశంబరుతో చాలామంది చందాలు అయిపోతాయి.
పెరుగుతున్నప్పటికిని, శ్రీవాణి వెలను మాత్రం పెంచదలచలేదు. మామూలు ప్రతి రు. 3 00 లు. జనవరి ప్రత్యేక
సంచిక రు. 5-00 లు. లోగడ మాదిరిగానే ఉంటుంది. అయితే పోస్టల్ రేట్లు పెరుగుతాయి కాబట్టి సంవత్సర చందా
మాత్రం రు 36-00 లు చేశాం. ఒక సంవత్సరంలో విడుదల చేసే విడి సంచికల వెల మొత్తం కలిసితే (రు 38-00)
యింకా సంవత్సర చందా రు 2-00 లు తక్కువే అవుతుంది. ఇది జనవరి నుండి అమలులోనికి వస్తుంది.

కొంతమంది వారపత్రికగా
శ్రీవాణిని ప్రశంసిస్తూ పెద్దలు అనేక లేఖలు వ్రాస్తున్నారు, వారికి అభివందనలు.
మారుస్తే బాగుంటుందని వ్రాస్తున్నారు. అంత తేలిక కాదుగదా ! భగవదానుగ్రహం వలన వారపత్రిక చేసే రోజు
వస్తుందేమో ! అయితే తొందర పడటం ప్రస్తుతానికి సముచితం కాదు. పాఠకులు తమ చందాను పంపుతూ కనీసం
ఒక మిత్రునితో క్రొత్త చందాను కట్టించే ప్రయత్నం చేసి " శ్రీవాణి " సర్క్యులేషన్‌ను పెంచడానికి దోహదం చేస్తా
రని ఆశిస్తున్నాను. వ్యాపారస్థులు, పారిశ్రామికవేత్తలు ప్రకటనల ద్వారా శ్రీవాణికి ఆర్థిక పుష్టిని చేకూరుస్తారని
విశ్వసిస్తున్నాను.

అందువలననే ఈ సుదీర
" శ్రీవాణి" కష్ట సుఖాలను పాఠకులకు వివరించకుండా ఉండటం ధర్మం కాదుగదా !
మైన లేఖను ప్రత్యేకంగా వ్రాస్తున్నాను. ఆగ్రహించక, అనురాగంతో అనుగ్రహించి, సహృదయంతో స్వీకరించి
శ్రీవాణి పత్రికను నిలబెట్టుటకు అవసరమైన, సముచితమైన, న్యాయమైన సహకారమును అందించి సాహిత్య, సాంస్కృ
తిక, ఆధ్యాత్మిక, విద్యా ప్రచారానికి తోడ్పడుతారని ఆశిస్తున్నాను, విశ్వసిస్తున్నాను, అర్థిస్తున్నాను.

భవదీయుడు

ధన్యవాదములు

కొమ్మగిరి కృష్ణమోహనరావు

సంపాదకుడు

డిశంబరు - 1986

సంపుటి : 2

సంచిక : 12

# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు-కొమరగిరి కృష్ణమోహనరావు


మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-51 రామానాయుడుపేట

మచిలీపట్నం-521 001

ఫోన్ : 2818

జనవరి 1987 నుండి

విడిప్రతి : రు. 3-00

సంవత్సర చందా : రు. 36-00

2 సం॥ల చందా : రు. 66-00

4 సం॥ల చందా : రు. 116-00

జీవిత సభ్యత్వం : రు. 500-00

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at

SPANDANA PRINTERS MACHILIPATNAM


విషయసూచిక



ముఖచిత్రం

రవీంద్రనాథ్ ఠాగూర్

విజయవాడలో జనవరి 12వ తేదీన 'శ్రీవాణి' ద్వితీయ వార్షికోత్సవం అందరూ ఆహ్వానితులే. జనవరి ప్రత్యేక సంచిక ది 17-1-1987న పోస్టు చేయబడును. గమనించ ప్రార్థన.

శ్లో॥ సింహాదేకం, బకాదేకం శిక్షేచ్ఛత్వారి కుక్కుటాత్
వాయసాత్పంచశిక్షేచ్ఛ షట్ శునస్త్రీణి గర్దభాత్ ॥

సింహం తన వేట తానే ఆడుతుంది. ఇతరులమీద ఆధారపడదు. అలాగే మనిషి చిన్నపనైనా పెద్ద పనైనా స్వయంగా చేసుకోవటం వుత్తమం. ఇది సింహంలో వున్న ఒక మంచి గుణం.




అలాగే కొంగ ఒంటికాలిమీద నిలబడి తానున్న దేశ కాలాలు గుర్తిస్తూ ఏకాగ్రతతో చేప కోసం వేచివుండి యిట్టే పట్టేస్తుంది. అలాగే వివేకవంతుడు దేశ కాల పాత్రాదుల్ని తెలిసికొని ఇంద్రియ నిగ్రహంతో కార్య సాధన చేసుకోవాలి.

కోడిలో నాలుగు గుణాలున్నాయి. పెందరాడె మేల్కోటం, పట్టుదలతో ప్రాణాలు లెక్క చేయకుండా శత్రువుతో పోట్లాడటం, తనవాళ్ళ నందరిని వెంటపెట్టుకొని ఆహారం సమానంగా పంచుతుంది. అంతేకాక తినే ఆహారాన్ని పరిశీలించిగాని తినదు.

మానవుడు కూడా బ్రాహ్మ ముహూర్తంలో మేల్కొనాలి, దేశంకోసం ప్రాణాల్ని తృణప్రాయంగా భావించాలి, తనకు కలిగినదాన్లో తోటి మానవులకింత పంచిపెట్టాలి, పరిశుభ్రమైన ఆహారాన్ని తినాలి. ఈ నాలుగూ యెంత మంచి గుణాలు !

ఇలాగే కాకి తన ఆడకాకితోటి ప్రేమ సంబంధాన్ని చాలా గూఢంగా వుంచుతుంది. చాలా ధైర్యంగా జీవనం గడుపుతుంది. ప్రతి క్షణం తన అహార సంపాదనకోసం ప్రయత్నిస్తూనే ఉంటుంది. ఎవరినీ నమ్మదు. తాను మాత్రం ఎప్పుడూ అప్రమత్తంగా వుంటుంది. ఈ ఐదు గుణాలూ మనిషి గమనించటం మంచిది. గూఢంగా ఉండాల్సిన దాంపత్యధర్మం బజారెక్కకూడదు. జీవితంలో అధైర్యం పిరికి లక్షణమౌతుంది – సంపాదించేటప్పుడు ప్రతి పైసా కూడబెట్టాల్సిందే. తొందరగా ప్రతివాణ్ణి నమ్మి మోసపోకూడదు. తానెల్లకాలం అతి జాగ్రత్తగా ప్రవర్తించాలి. నిజానికివన్నీ యెంత మంచిగుణాలో చూడండి.

కుక్కకూడా తక్కువది కాదు కడుపునిండా తింటుంది. ఎంత కొంచెం పెట్టినా తృప్తి పడుతుంది. హాయిగా నిద్రపోతుంది. కాని చీమ చిటుక్కుమంటే లేచి చూస్తుంది. దానికున్న స్వామిభక్తి దొడ్డది. దాని శౌర్యం ఎంతదో మనకు తెలుసు.

మనిషికూడా పుష్టిగా తినాల్సిందే, అలాగే అల్ప సంతోషి కావాలి. రోజూ గాఢనిద్ర పోవటం ఆరోగ్య హేతువు. అలాగని బండనిద్ర కాదు. వెంటనే మేల్కొనే స్వభావం వుండాలి. పెద్దల విషయంలోను, ప్రభుత్వ విషయంలోను భక్తి శ్రద్ధలు చూపించాలి. శౌర్యంతో వ్యవహరించాలి సమయం వచ్చినప్పుడు. ఈ ఆరు గుణాలు అలవాటు చేసుకోదగినవి. ఇక గాడిద విషయం ఆలోచిద్దాం. అది యెంత అలసిపోయినా భారం మోస్తూ బాధ్యత నిర్వర్తిస్తుంది. శీతోష్ణాలను లెక్క చేయకుండా సహనం వహిస్తుంది. ఎప్పుడు చూచినా సంతోషమేగాని దానికి విచారమనేది వుండదు.

ఈ మూడు గుణాలు మనిషికి యెంత అవసరాలో తెలుస్తూనే వుంది కదా !

చాణక్యుని యీ పరిశీలనం మానవజాతి జీవనంలో ఒక చక్కని ప్రబోధం.

( ఆకాశవాణి సౌజన్యంతో )

# సంపాదకీయం విద్యారంగంలో సంక్షోభ

ఆలయములు అత్యంత పవిత్రములు. అట్టి పవిత్రములైన ఆలయములకు నేడు గ్రహణం పట్టింది. ఆలయములు మూడు రకములు. 1. దేవాలయములు. 2. గ్రంథాలయములు. 3. విద్యాలయములు. ఈ మూడు రకముల ఆలయముల నిర్వహణ ప్రభుత్వ విష కబంధ హస్తములలో పడి నలిగి అపవిత్రములై పోతున్నాయి. దేవాలయములకు పట్టిన దుర్గతిని గురించి పలుపర్యాయములు "శ్రీవాణి" లో చర్చించబడింది. గ్రంథాలయముల వ్యవస్థ కూడా Director of Public Libraries వారి చేతులలో పడి అవస్థగా మారింది. అవినీతికి ఆలవాలమై; అశ్లీల, అసభ్యకరమైన చెత్త సాహిత్యంతో నిండిపోతున్నాయి. విద్యాలయముల నిర్వహణ ఈపాటికే రెండువంతులు ప్రభుత్వం ఆధీనంలోనికి పోయి, తల్లిదండ్రులు ఆశించినంత చదువులేక, క్రమశిక్షణ కోల్పోయి, అశాంతికి ఆలవాలమై పోయినాయి. స్వేచ్ఛగా, స్వతంత్రంగా నడుపుకుంటూ తాము జీవిస్తూ, అనేక వేలమంది నిరుద్యోగులైన విద్యావంతులకు జీవన భృతిని కలిపిస్తూ, బాలబాలికలకు ఉత్తమ శిక్షణ గరుపుతున్న ప్రయివేటు విద్యాలయము ( కాన్వెంట్స్, ట్యుటోరియల్స్ ) ల మీదకూడా ప్రభుత్వం కన్ను పడింది. ప్రభుత్వ హస్తము భస్మాసురుని హస్తమునకు ఏ మాత్రం తీసిపోదని అనుభవజ్ఞుల అభిప్రాయం.

"విద్య స్వేచ్ఛగా జగ తంతా వ్యాపించాలంటే విద్యారంగము ప్రభుత్వమునుండి వేరు కావాలి. ఏ విధంగా న్యాయస్థానములు స్వతంత్రమైన రీతిగా అభివృద్ధి అవుతున్నాయో, అదే విధముగా విద్య కూడా స్వతంత్రంగా ఉండాలి. కొంతమంది విద్యావేత్తలతో; అనుభవజ్ఞులైన మేధావులతో ఒక స్వతంత్ర ప్రతిపత్తిగల సంస్థను ఏర్పర్చి, దీని మంచి చెడ్డలను విచారించగల అధికారం యివ్వాలి. ప్రభుత్వం చేతిలో ఈ రంగమును పెట్టినయెడల, స్వప్రయోజనాలకు స్వార్థాలకు ఈ రంగం బలై విద్యాసంస్థలకు భిన్నమైన పరిస్థితి ఏర్పడి వాటి పవిత్ర లక్ష్యమునకే హాని కలుగుతుంది." అని శ్రీ సత్యసాయిబాబాగారు చేసిన హెచ్చరికను ప్రభుత్వం గుర్తించడం సముచితం.

1982 సం. సమగ్ర విద్యా చట్టమును సవరించి, ప్రయివేటు విద్యా సంస్థల మీద నియమ నిబంధనలను విధించబోతున్నట్లుగా విద్యాశాఖా మంత్రిగారు శలవిచ్చారు. ఇది కేవలం అనాలోచితమైన చర్యే అవుతుంది. దీనివలన విద్యారంగంలో సంక్షోభం ఏర్పడటం ఖాయం. కె. జి. నుండి పి. జి వరకు పరీక్షలకు వెళ్ళడానికి ఒక వైపు అవకాశం యిచ్చి సార్వజనీన విద్యావిధానాన్ని (Open University System) ప్రోత్సహిస్తున్న తరుణంలో ప్రయివేటు విద్యాసంస్థలను నిరుత్సాహ పరచ ప్రయత్నించడం అవివేకం. ప్రయివేటు విద్యాసంస్థల మీద ఒక్క నయాపైసా కూడా వెచ్చించకుండా, ప్రభుత్వానికి కొన్ని కోట్ల రూపాయిల ఆదాయం పరీక్ష ఫీజులు, ఎక్జంప్షన్ ఫీజుల రూపంలో వస్తున్నది. అంతేకాదు ప్రభుత్వ ఆధీనంలో చదువుతున్న విద్యార్థుల కన్నా, ప్రయివేటు విద్యాసంస్థలలో చదివే విద్యార్థులే ఎక్కువ మార్కులతో అధికశాతం ఉత్తీర్ణులవుతూ, ఇతర రాష్ట్రాలలో నున్న మెడికల్, ఇంజనీరింగ్ సంస్థలలో అత్యధికమైన సీట్లు సంపాదిస్తూ మన రాష్ట్ర ప్రతిష్ఠను యినుమడింప చేసున్నారు. ప్రభుత్వ ఆధీనంలో నిర్వహించబడుతున్న విద్యాసంస్థలలో ఆశించినంత చదువు లేకపోవడంచేతనే ప్రయివేటు విద్యాసంస్థలకు తల్లిదండ్రుల ఆదరం లభిస్తున్నది. ఈ వాస్తవాన్ని సహృదయంతో గమనించకుండా "పుట్టగొడుగులు" అని విద్యాశాఖా మంత్రిగారు ప్రయివేటు విద్యాసంస్థలను కించపరచడం దురదృష్టకరం. ప్రభుత్వం పూర్వాపరాలను విచారించకుండా అవాస్తవికమైన, అనాలోచితమైన నియమ నిబంధనలను తొందరపడి ప్రవేశపెడుతే చివరకు నష్టపోయేది విద్యార్థులు, కష్టపడవలసినది ప్రభుత్వమే అవుతుంది. ప్రయివేటు విద్యాసంస్థలు మూతపడితే ప్రభుత్వంపై అదనపు ఆర్థికభారం పడుతుంది. ఇప్పటికే ఆర్థిక సంక్షోభంలోపడి సతమత మవుతున్న ప్రభుత్వానికి మరింత భారమవుతుంది. విద్యారంగంలో అసంతృప్తి జ్వాలలు చెలరేగి సంక్షోభం ఏర్పడుతుంది. వేలాదిమంది నిరుద్యోగులవుతారు కనుక ఈ విషయంలో తొందర పనికిరాదు. విద్యావంతులైన మేధావులతో, ఆంధ్రప్రదేశ్ ట్యుటోరియల్స్ అండ్ కాన్వెంట్స్ అసోసియేషన్ ప్రతినిధులతో చర్చలు జరుపడం సముచితం. అది చేయకుండా ఏకపక్షంగా ప్రభుత్వం నిర్ణయాలను గైకొనిన యెడల ప్రభుత్వం అనేక యిబ్బందులను ఎదుర్కొనవలసి వస్తుందని హెచ్చరిస్తున్నాను. ప్రభుత్వం విజ్ఞతను ప్రదర్శిస్తుందని ఆశిస్తున్నాను.



# ప్రశాంతి నిలయంలో ఆనందోత్సవాలు

ప్రశాంతినిలయంలో విశ్వవిద్యాలయ పంచమ స్నాతకోత్సవం మరియు భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారి 61 వ జన్మదినోత్సవములు హుందాతనంగా, సాంప్రదాయబద్ధంగా, వేదోక్తంగా, నిరాడంబరంగా, కనులపండుగగా జరిగాయి. విద్యారంగం విలువలను ఇనుమడింపచేసే విధంగా ఉన్నవి. అంతేకాదు, భారతీయ సంస్కృతీ సంప్రదాయాలను గుర్తు చేశాయి. బాబా వారి ఆశయ ఆదర్శములు ఎట్టివో ప్రస్ఫుటంగా ప్రతిబింబించాయి. భారతీయ విద్య యొక్క ఔన్నత్యమును చాటాయి. విద్యార్థుల క్రమశిక్షణ, సత్ప్రవర్తన అడుగడుగునా కనిపించింది. అధ్యాపకుల శ్రద్ధాభక్తులు కృషి తేటతెల్లమైంది. బాల బాలికలను ఉత్తమ పౌరులుగా తీర్చి దిద్దడానికి బాబాగారు ఎంత శ్రద్ధ తీసుకుంటున్నారో, అవిరామ కృషి చేస్తున్నారో ఆ ఉత్సవాలను చూచినవారికి బోధపడుతుంది. స్వాతంత్ర్యం వచ్చి 40 సంవత్సరాలు కావస్తున్నా విద్యారంగంలో అవసరమైన మార్పులను మన ప్రభుత్వాలు తీసుకొని రాలేకపోయాయి. అనతికాలంలోనే బాబాగారు మాత్రం దీనిని సాధించారు. ప్రభుత్వాలు, విద్యాభిమానులు బాబాగారిని ఈ విషయంలో అనుసరించినప్పుడు విద్యారంగంలో సంక్షోభం పైదొలిగి బాలబాలికలను ఉత్తమ పౌరులుగా తీర్చి దిద్దే సదవకాశం లభిస్తుంది. ఆ శుభ దినం కోసం ఎదురుచూద్దాం.

పుట్టపర్తి విశ్వవిద్యాలయం మరియు అనుబంధ విద్యాసంస్థలలో బాలబాలికలు అన్ని రంగాలలో చక్కగా తీర్చి దిద్దబడుతున్నారు. దానికి నిదర్శనం ది. 22-11-1986 న జరిగిన స్నాతకోత్సవం స్నాతకోత్సవ సభకు ముందు బాబాగారిని, ముఖ్య అతిధిగా విచ్చేసిన మహారాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ యస్. బి. చవాన్‌గారిని వైస్ ఛాన్సలర్ శ్రీ యస్. యస్. సరాగారిని చక్కటి గణ వేషధారులై, మిలటరీ బ్యాండును వాయిస్తూ, మరికొంతమంది విద్యార్థులు వేద పఠన చేస్తూ పూర్ణచంద్ర ఆడిటోరియమునకు తీసుకువచ్చే దృశ్యం తిలకించిన వారికి ఒళ్ళు పులకించింది. వివిధ సబ్జెక్టులలో ప్రథములైన బాలబాలికలకు గోల్డు మెడల్స్ బహూకరించబడినాయి. అందరికీ పట్టా ప్రదానం చేయబడింది. అంతేకాదు ప్రవర్తనలో ఉత్తములుగా గుర్తించబడిన ఒక బాలికకు, ఒక బాలునికి కూడా స్వర్ణపతకం బాబాగారు బహూకరించారు. విద్య అంటే కేవలం చదవడం, వ్రాయడం, అత్యున్నతమైన ర్యాంకులను సంపాదించడమే కాదని వినయ, విధేయతలు ప్రధానమని ఆ బహుమతులు స్పష్టం చేస్తున్నాయి, ప్రోత్సహిస్తున్నాయి. సభానంతరం ఆదిశంకరాచార్య ఇంగ్లీషు నాటకం, సంస్కృత శ్లోకాలతో విద్యార్థులు అమోఘంగా ప్రదర్శించారు. ఆ ఉత్సవాలలో భక్తులు ప్రపంచం నలుమూలల నుండి పాల్గొనినారు.

బాబాగారి 61 వ జన్మదినోత్సవం ది. 23-11-86 న అతి నిరాడంబరంగా జరిగింది. సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ భగవతి, జస్టిస్ ఎరాడే, మహారాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ చవాన్, కచ్ రాజమాత, డా॥ గోకాక్, ఎయిర్ మార్షల్ మెహెరా, కర్నల్ యస్. పి. జోగారావు, సత్యసాయి సేవాసమితి వరల్డ్ కౌన్సిల్ అధ్యక్షులు డా॥ గోస్టిన్, ఇటలీ ప్రధాని సోదరుడు క్రాక్సీ మొదలగు వారెందరో పెద్దలు వేదిక మీద ఆశీనులై బాబాగారికి సాష్టాంగ నమస్కారం చేశారు. తదనంతరం బాబాగారు దివ్య సందేశం యిచ్చారు. ఆ రోజు రాత్రి లక్షలాదిమంది భక్తులు పాల్గొనిన హిల్‌వ్యూ స్టేడియంలో సినీ యాక్టర్ శ్రీమతి జమున (సత్యభామగ) నేతృత్వంలో శ్రీకృష్ణ తులాభారం నాటకం చక్కగా ప్రదర్శించ బడింది.

ఈ ఉత్సవాలలో పాల్గొనడానికి సకుటుంబంగా 21 వ తేది ఉదయానికి ప్రశాంతినిలయం చేరిన మాకు 26 వ తేది ఉదయం బాబాగారి అనుగ్రహం ప్రాప్తించింది. వారితో ప్రత్యేకంగా ఇంటర్‌వ్యూ పొందే మహాభాగ్యం లభించింది. 1985 అక్టోబర్‌లో ప్రథమంగా ప్రశాంతినిలయం వెళ్ళినప్పుడు 21 10 85 న నాకు ఇంటర్‌వ్యూ లభించింది. ఆనాడు నా "శ్రీవాణి" పత్రికకు బాబాగారి పవిత్రమైన ఆశీస్సులు, సందేశం లభించింది. రెండవ పర్యాయం నా శ్రీమతితో 1986 జూలైలో వెళ్ళగా, ది. 23-7 86 న బాబాగారితో ప్రత్యేకంగా ఇంటర్‌వ్యూ లభించింది. పవిత్రమైన శివలింగమును సృష్టించి నాకు ఆనాడు యిచ్చారు. వారి పవిత్రమైన దీవెనలతో నా శ్రీమతికి ఆరోగ్యం చేకూరింది. ఈ తడవ బాబాగారి అనుగ్రహం మా మొత్తం కుటుంబానికే లభించింది. మా పిల్లలకు చక్కటి నీతి బోధ చేశారు. ఒక ఉంగరమును సృష్టించి బాబాగారే వారి పవిత్రమైన హస్తములతో నా వేలికి తొడిగారు. ప్రశాంతినిలయం మూడు పర్యాయములు వెళ్లాను. ఈ మూడు పర్యాయములు ముందు నడవడానికి అవసరమైన ఆత్మ విశ్వాసాన్ని నాకు ప్రసాదించారు.

బాబాగారి అనుగ్రహానికి పాత్రుడనైనాను. ఒక మిత్రుడు నాతో "నీవు శాసనసభ సీటు సంపాదించలేక పోయినప్పటికీ భగవాన్ బాబాగారి ప్రేమసామ్రాజ్యంలో సీటును సంపాదించగలిగావు. నీ జీవితం ధన్యమైంది" అని అన్నాడు, ఇది అక్షరాల నిజం. అయితే ఈనాడు నాకు బాధ్యత మరింత పెరిగిందని భావిస్తున్నాను. నా కర్తవ్య నిర్వహణలో ముందుకు సాఫీగా సాగిపోవడానికి అవసరమైన శక్తి సామర్థ్యములను అనుగ్రహించుమని బాబాగారికి భక్తి ప్రపత్తులతో ప్రణమిల్లి ప్రార్థిస్తున్నాను.

ఓం సాయిరాం.

— కొమరగిరి



# సర్వోపనిషత్తుల సారమే భగవద్గీత

— శ్రీ సత్యసాయిబాబా

" లోని శత్రువులకు లొంగిపోయినవాడు
బయిట రిపులనెట్లు పట్టగలడు
తత్వమెరిగినంత ధన్యుడౌ నరుడిలన్
ఉన్నమాట తెలుపుచున్నమాట "

**మానవ** పరిణామమే విశ్వపరిణామం. మనిషి మారినప్పుడే ప్రపంచం మారగలదు. వ్యక్తి మారినప్పుడే సమాజంకూడా మారగలదు. భౌతిక పరివర్తనతో పాటు మానసిక పరివర్తన, దానితోపాటు ఆధ్యాత్మిక పరివర్తన అత్యవసరం. ఎందరో తత్వవేత్తలు, మహనీయులు ఎంతో కాలంనుండి భగవత్తత్వమును గురించి ప్రచార ప్రబోధనలు సల్పుతూ వస్తున్నారు. అయితే ఆచరణమైన ప్రబోధనలు ఈనాడు అత్యవసరం ఒక్కొక్క మతం వారు ఒక్కొక్క గ్రంథమును. ప్రమాణముగా స్వీకరించి ప్రచారం చేస్తున్నారు భారతీయులకు భగవద్గీత ప్రమాణ గ్రంథం. ఇది ఒక భారతీయులకే ప్రమాణ గ్రంథమని భావించడం పొరపాటు. దేశ కాల పాత్రలకు అతీతమైన గ్రంథం యిది. జాతి మత కులములకు అతీతమైనది. ఇది అద్వైతసారముతో కూడిన గ్రంథం. సర్వోపనిషత్తుల సారమే భగవద్గీత. దీనిని గ్రోలినవారు దీనులైనా ధీరులుగా మారగలరు. ఈ అంతరార్థాన్ని గుర్తించక భ్రమలకు లోనవుతున్నాం. భ్రమ రహితులను గావించేది భగవద్గీత. భ్రమలకు అతీతమైనటువంటిది ఈ గీత. గుణములద్వారా వెలువడినటువంటివే ఈ భ్రమలు. గుణాతీతుడు భగవంతుడు. కనుక దివ్యత్వమును చేరుకొనవలెనని దీని అంతరార్థమును తెలుసుకోవాలి. అనేకత్వంలోని ఏకత్వమును గుర్తించినప్పుడే దివ్యత్వమైన ఆత్మతత్వము మనకు అర్థమవుతుంది.

## తత్వం జ్ఞానం

తత్వ జ్ఞానంతో కూడినటువంటిదే భగవద్గీత. "తత్వము" అనగా ఏమిటి ? 'త్వం' అనగా జీవస్థానముతో కూడినటువంటిది. " తత్ " అనేది ఈశ్వర స్థానంతో కూడినటువంటిది. జీవతత్వంతో కూడిన 'త్వం' ను, ఈశ్వరత్వంతో కూడిన 'తత్' నకు చేర్చినప్పుడే ఇది 'తత్వం' అవుతుంది. జీవేశ్వర సమ్మిళితమైన జ్ఞానమే ఈ భగవద్గీత అనే తత్వ జ్ఞానం. జీవాత్మ పరమాత్మల చేరికయే ఈ తత్వ జ్ఞానం. ఇటువంటి విశాలమైన పవిత్రమైనటువంటి గ్రంథమును సంకుచిత భావములతో ఆరాధనసల్పుతున్నాము. పారాయణలతో కాలం వృథా చేస్తున్నాం. దీనిని ఆచరణరూపంగా అనుభవించాలి.

## భ్రమలు

ఈ పవిత్రమైన గ్రంథముయొక్క నిజ తత్వమును గుర్తించాలి. కష్ణార్జునులను కేవలం దేహధారులుగా భావించి దీనిని పఠిస్తున్నాము. ఈ విధంగా భావించి పఠించినంతకాలం దైవత్వాన్ని పొందలేం, అనుభవించలేం. కృష్ణార్జునుల జీవేశ్వర స్వరూపులుగా మనం భావించాలి. బంధుమిత్రులను చూచి అర్జునునికి భ్రమ కలిగింది. భ్రమ మమత్వంతో కూడినటువంటిది. ఈ మమత్వం అభిమానంతో చేరినటువంటిది. అభిమాన మమకారముల చేతనే ఈ భ్రమ సంభవించినది. ఇట్టి భ్రమకు లోనైన అర్జునునితో కృష్ణుడు " ఓ అర్జునా ! భ్రమ ఉండినంతవరకు బ్రహ్మాను చూడలేవు, చేరలేవు." అని చెప్పి భ్రమను పోగొట్టి, భయమును నిర్మూలనం చేసి బ్రహ్మతత్వాన్ని నిరూపించాడు. అప్పుడే దీనుడైన అర్జునుడు ధీరుడుగా మారాడు. అర్జునునికి ప్రతినిధులైన

# అనంత చైతన్య యాత్ర

మరణ యాతన పడుతోంది - కోరిక
అంతిమ యాత్రకు సన్నాహాలు చేస్తోంది కన్నీటి పరిచారిక!

కలల పురులూ, ఆశల గాదెలూ ఖాళీ అయినై ;
శుష్క ప్రియాల్ని మోస్తోంది - ప్రయత్నం ;
శూన్య హస్తాల్ని చూస్తోంది - అర్హత !
వ్యవస్థ సహస్ర పాద జంతువు
దాని ' టెంటకిల్స్ ' లో చిక్కుకుంటే
మరి, ఇంతే సంగతులు !

మన తరానికి సూర్యోదయాలు కూడా
' మోనాటనస్ ' గానే తయారయినై !

అందుకే —
ఈ నాటి కోరికని బతికించుకొనే
ధైర్యం మాత్రమే చాలదు,
రేపటి మొలకకి
ఊపిరిలూదే సాహసం కావాలి !

ఒడ్డున విరిగిన కెరటానికి
అండగా మేమున్నామని గుండెలు వొడ్డడానికి
కోటి కోటి అలలు —
దీక్షా కిరీటాలు పెట్టుకుని కవాతుగా వస్తూనే వుంటయ్,
ఈ గమ్యానికి నిర్దేశకులుగా
సూర్యుడూ, చంద్రుడూ "కమ్చీ" పూని లేస్తూనే వుంటారు!

— విహారి

జీవులు ఈనాడు భ్రమలచేత, దీనత్వంచేత అజ్ఞానంలో మునిగిపోతున్నారు. కర్తవ్యాన్ని విస్మరిస్తున్నారు. కనుక ఇట్టి భ్రమలను దూరం చేసుకోవాలి.

## ధర్మశాస్త్రం

ఈనాడు భగవద్గీత సప్తాహములు, యజ్ఞములు విరివిగా పెరిగిపోతున్నాయి. ఇవి భ్రమతో కూడిన మానవుణ్ణి మరింత భ్రమలలో ముంచి భ్రష్టులను గావించుచున్నాయి. ఇవి తాత్కాలికంగా కొంత ఆనందమును చేకూరుస్తున్నాయే గాని నిజమైన ఆనందమును అందించడంలేదు. కారణ మేమిటి ? ఒక గ్రామఫోను ప్లేటువలె కేవలం శ్లోకము లను పఠిస్తున్నాం, పారాయణ సల్పుతున్నామే గాని, పవిత్రమైన గీతాసారమును అర్థం చేసుకోలేకపోతున్నాం. అందువలన మనం సరైన ఫలితమును పొందలేక పోతున్నాం కనుక గీతను ఆచరణయందు పెట్టి ఆనంద మును అనుభవించాలి. అర్జునుని నిమిత్తమాత్రంగా పెట్టు కొని కృష్ణుడు ఈ గీతను బోధించాడు. "ఓ సవ్యసాచి ! నిన్ను నిమిత్తంగా పెట్టుకున్నాను. ఈ భగవద్గీత జగత్తుకే సంబంధించినది. నేను సర్వ జీవులయందు ఆత్మస్వరూ పుడనై ఉన్నాను. నీవు వేరు, నేను వేరుకాదు. నీవు ఈ యదార్థమును మరచిపోతున్నావు. మబ్బులచేత కప్పబడి ఉన్న సూర్యుడు మనకు కనిపించనంత మాత్ర మున సూర్యుడు లేడని భావించరాదు. నీవు సత్యమును గుర్తించలేక పోయినంతమాత్రమున అసలు సత్యమే లేదని వాదించడం భావ్యంకాదు తనను తాను గుర్తించు కుంటే తానే బ్రహ్మ అయిపోతాడు. తానుగా గుర్తించే ట్లుగ చేయడమే భగవద్గీత సారం." అని బోధించాడు. అర్జునుడు జీవుడు, కృష్ణుడు దేవుడని భావించరాదు. భిన్నత్వంలోనే మనకు భయభ్రాంతులు కలుగుతున్నాయి. దీనిని ఏకత్వంగా భావించుకొనే తత్వాన్ని మనం అర్థం చేసు కోవాలి. భగవద్గీత ధర్మశాస్త్రం. అందువలననే ధర్మం క్షీణించినప్పుడల్లా, ధర్మాన్ని రక్షించుటకు తాను అవత రిస్తుంటానని కృష్ణుడు చెప్పాడు.

## ధర్మం ?

ధర్మం అంటే ఏమిటి ? మానవుని కర్తవ్యాన్ని గుర్తింపజేసి, వర్తింపజేసేటటువంటిదే ధర్మం. ఇది మానవుని ప్రాణం వంటిది. పుష్పమునకు సుగంధం ఎటువంటిదో, మానవునికి ప్రీతి అటువంటిది. ఈ ప్రీతి నీతి నిజాయితీలతో కూడినటువంటిది అయివుండాలి. ధర్మాన్ని గుర్తించుకొనే నిమిత్తమై ఈ ధర్మాన్ని ప్రవేశ

పెట్టాలి. "ధర్మాన్ని బోధించడం, ధనాన్ని ఆశించడం" పొత్తు కుదురుతుందా ? ధనంతో కొనేటటువంటిది కాదు ధర్మం. హృదయంతో కొనేటటువంటిది. దురదృష్టవశాత్తు ఈనాడు భగవద్గీత ప్రచారాలు చాలావరకు వ్యాపార రంగాలుగా తయారవుతున్నాయి. ఇది ఏమాత్రం మంచిది కాదు.

## మాయ

మానవునియందు గల భ్రమను ముందు తొలగించాలి. పుట్టినప్పటినుంచి గిట్టేంతవరకు ఇట్టి భ్రమలతోనే మనం జీవిస్తున్నాం. దీనినే 'మాయ' అంటారు.

బ్రతుకులన్నియు మాయ
భవ బంధములు మాయ
సంసారమది **మాయ**, చావు **మాయ**
మాయ బ్రతుకు కింత మాయలో పడనేల

ఈ మాయను నిర్మూలనంగావించుకొని మాధవత్వాన్ని చేరుకోవాలి. మానవుని మాధవునిగా చేయడమే వేదాంత సారం. ఇదే భగవద్గీత మనకు బోధిస్తున్నది. ఈ వాస్తవాన్ని గుర్తించకుండా కేవలం పారాయణంలో కాలం వృథా చేస్తున్నాం.

## పరిశీలన, పరిశోధన

భగవద్గీత పారాయణం చేయడం వలన దుఃఖం ప్రాప్తిస్తుందా ? ఇది పారాయణం చేయవలసింది కాకపోవడం వలననే మనకు దుఃఖం ప్రాప్తిస్తున్నది. ఇది ఆచరణ రూపమైన గ్రంథం, అమృతతుల్యమైన గ్రంథం. అమృతమును కంఠమునందు పోసుకొనినప్పుడే సరైన ఫలితం వస్తుందిగాని ; ముక్కులో పోసుకుంటే ప్రాణం తీస్తుంది. కనుక అమృతమును అనుభవించ వలసిన మార్గంలో అనుభవించాలి. ప్రతి విషయంలో మానవుడు అనుభవించుటకు ముందు చక్కగా విచారణ సలిపి, పరిశీలన చేయాలి. పరిశీలన జరిపినప్పుడే పరిశోధన కూడా లభ్యమవుతుంది. పరిశీలనా పరిశోధనలే మన ఆనందమునకు మూల కారణం భగవద్గీత యొక్క తత్వమును చక్కగా అర్థంచేసుకొని ఆచరణలో పెట్టాలి. ఈ సత్యమును గుర్తించకుండా కేవలం యజ్ఞ యాగాదులలో నిమగ్నులవుతున్నారు. ఇవి అద్దములో ప్రతిబింబము వలె తాత్కాలిక ఆనందమును చేకూరుస్తాయిగాని, శాశ్వతమైన, నిజమైన ఆనందమును అందించవు.

## కర్తవ్య

భగవద్గీతను సరిగా అవగాహన చేసుకుంటే మన కర్తవ్యం ఏమిటో మనకు బోధపడుతుంది. "కరిష్యే వచనం తవ" నీ ఆజ్ఞలను శిరసావహించి నీవు చెప్పినట్లే చేస్తానన్నాడు అర్జునుడు. పూర్తిగా దాసోహమన్నాడు. ఈ విశ్వాసమును పురస్కరించుకొని కృష్ణుడు చక్కగా ధైర్యం బోధించి, దీనత్వమును దూరంచేసి, వీరత్వమును అభివృద్ధిపరచి కార్యోన్ముఖుని గావించాడు. "కర్తవ్యం యోగముచ్యతే" కర్తవ్యమే నిజమైన యోగము. కర్తవ్యాన్ని విస్మరించినవానికి రోగం. విశ్వాసంతో భగవంతుని తన హృదయమునందు ప్రతిష్ఠించుకోవాలి. ఆయన ఆజ్ఞలను తు. చ. తప్పకుండా శిరసావహించాలి. అప్పుడే భగవంతుని అనుగ్రహమునకు పాత్రులవుతారు. అర్జునుడు ఆ విధంగా కృష్ణుని నమ్ముకున్నాడు కనుకనే యుద్ధంలో సారధ్యం వహించాడు. అర్జునుని జీవితమునకే అతను సారధి, అతనే పార్థసారధి. పార్థ సారధ్యమనగా ఏమిటి ? పార్థుడనగా అర్జునుడే కాదు, పృథ్వీ పుత్రుడు మానవుడే మనమంతా పృథ్వీ పుత్రులమే. ప్రతి ఒక్క వ్యక్తికీ తాను సారథే కనుక నా జీవితమునకు ఈ సారధ్యత్వాన్ని వహించమని ప్రతి ఒక్కరు భగవంతుని ప్రార్థించాలి. అప్పుడే నీవు ఒక వనిముట్టుగా తయారవుతావు. నీ కర్తవ్యమును నీవు తెలుసుకుంటావు. అర్జునుడు ఆ విధంగా ప్రవర్తించాడు కాబట్టే అభయాన్నిచ్చాడు, ఆదుకున్నాడు, భగవంతుడు.

## ఆచరణ

ప్రతిరోజు ఎన్నో లక్షల భగవద్గీతలు ప్రింటు అవుతున్నాయి. విదేశీయులు కూడా నిత్యం పారాయణం చేస్తున్నారు. కాని మానసిక పరివర్తన కలగడం లేదు.

ఈ మానసిక పరివర్తనకు మొట్టమొదట భౌతిక పరివర్తన రావాలి. మనిషి అనగా మనసే ; కృషి అనగా తలంపులే, నిత్య చర్యలే. కనుక మనిషి అనగా మన చర్యలే. మన నడవడికను మనం సరిదిద్దుకోవాలి. నడవడికను సరిదిద్దుకుంటే దీనిని అనుసరిస్తుంది మనస్సు. మానసిక పరివర్తనచేత ఆధ్యాత్మిక పరివర్తనకూడా సంభవిస్తుంది. ఇది కేవలం భగవద్గీతను పారాయణం చేయడం వలననే చేకూరదు. గీతా తత్వమును సరిగా అర్థం చేసుకొనినప్పుడు మాత్రమే సంభవిస్తుంది. మనం చేయవలసినది కేవలం ప్రచారాలు కావు, ఆచారాలు, ఆచరణలు. చెప్పే ముందు చేసి చూపించాలి. చెప్పిన విషయమును తాను ఆచరణ ముందు పెట్టాలి. ఈనాడు ఆచరణ రూపంలో గల ప్రచారములు అత్యవసరం.

## మమ ధర్మ

దైవముయొక్క మాటలు కేవలం నిస్వార్థమైనవి. ఆయన ఏది చెప్పినా, ఏది చూచినా, ఏది పలికినా అంతా మన మంచికే. ఈ సత్యాన్ని మనం విశ్వశించాలి.

" నమే పార్థాస్తి కర్తవ్యం
త్రిషులోకేషు కించన
నానవాప్త మవాప్తవ్యం
వర్త ఏవచ కర్మణి "

" నాకు ఈ త్రిలోకములయందును కూడను కావల్సింది ఏమీ లేదు. నేను చేయవలసింది ఏమీ లేదు. అనుభవించవలసింది ఏమీ లేదు. కాని నేను చేసే ప్రతి కర్మ కూడను మీ నిమిత్తమై చేస్తున్నాను. " అనే సత్యాన్ని పరమాత్మ చెప్పాడు. భగవద్గీతలోని 700 శ్లోకాలను కంఠస్థం చేస్తున్నాం. కాని దానిలోని అంతరార్థమును తెలుసుకోలేకపోతున్నాము. భగవద్గీత సంపూర్ణ సారమును తెలుసుకోవలెననిన రెండిటిని ఆధారంగా గైకొనవలెను. భగవద్గీత భక్తిని బోధిస్తుందని కొందరు మరి కొందరు జ్ఞానము బోధిస్తుందని, ఇంకా కొందరు కర్మను బోధిస్తుందని ఎవరిష్టమువచ్చినట్లు వారు వ్యాఖ్యానిస్తున్నారు. ఈ వ్యాఖ్యాతలు వారి వారి తెలివితేటలను పురస్కరించుకొని అనేక విధములైన రచనలు చేస్తున్నారు. వ్యాఖ్యానాల లోపల అసలు కృష్ణుని వాక్యం ఎక్కడ జారిపోతుందో ! జారిపోయింది. నానార్థములు చెప్పడంతో యదార్థం పోయి అనర్థాలు దాపురిస్తున్నాయి. మొట్టమొదటి శ్లోకంలోని ' ధర్మక్షేత్రే ' లో ' ధర్మము ' మొదటి పదము. కడపటి శ్లోకంలోని కడపటి పదము 'మమ'. ఈ 'మమ' మరియు మొదటి శ్లోకములోని మొదటి పదము ' ధర్మ ' రెండింటినీ చేరుస్తే ' మమ ధర్మ ' అవుతుంది. ఎవరు ఏ రీతిగా ధర్మమును ఆచరించాలో సూక్ష్మంగా గ్రహించాలి. అందరికీ ఒకే ధర్మం చెల్లదు. బ్రహ్మచారికి, గృహస్థునికి, వానప్రస్థునికి, సన్యాసికి, విద్యార్థికి, ఉద్యోగికి, వ్యవసాయదారునికి, వ్యాపారస్థునికి, పురుషునికి, స్త్రీకి, గృహిణికి, కన్యకు-వారి వారి పనులనుబట్టి, బాధ్యతలను అనుసరించి ధర్మం స్వరూపం మారుతుంటుంది. ఎవరి ధర్మములు వారికి ప్రత్యేకంగా వుంటాయి. ధర్మము అనేటటువంటిది అందరికి సమంగా భావించడం అవివేకం. తమ యొక్క స్థితిని, మతిని, గతిని అనుసరించుకొని ధర్మము ననుసరించి ప్రవర్తించాలి. ఈ విధంగా ఆలోచించి అనుసరించడం చాలా కష్టం. బహు సులభమైన మార్గం "సర్వ కర్మ భగవత్ ప్రీత్యార్థం" స్వామీ ! సర్వమును నీ కర్పితం చేస్తున్నాను. నేను ఏమి చేస్తున్నప్పటికీ నీవు చేయించేటటువంటివే అనేటటువంటి శరణాగత భావంతో చేస్తే చాలా సులభంగా అవుతుంది.

## కర్మాచరణ

ప్రతి హృదయం మారాలి. నిత్యం పారాయణంతోనే సంతృప్తి చెందరాదు. ఆచరణలో చూపించాలి. పంచభక్ష పరమాన్నములు ముందు పెట్టుకొని చూస్తూ పంచభక్ష పరమాన్నం అంటూ ఎన్నిసార్లు ఉచ్చరించినా నీ కడుపు నిండుతుందా ! నిండదు. ఉచ్చరించవలసిన పనిలేదు. చేత్తో తీసుకొని నోటికి పనిపెట్టు చాలు. కడుపు నిండుతుంది. ప్రతి చేతికి పనిపెట్టడమే కర్మాచరణ. ఆచరణలో నీకు ఆనందం లభిస్తుందిగాని, పారాయణంలో నీకు ఆనందం లభించదు. భగవద్గీత యొక్క ప్రధాన ప్రమాణం ప్రచారం ప్రాణం. ఈ గీతా తత్వమును అర్థంచేసుకొని ఆచరణలో పెట్టడం ప్రతివాని కర్తవ్యం.

( ది 9-10-'86 న ప్రశాంతి నిలయంలో భగవాన్ శ్రీ సత్యసాయిబాబాగారు యిచ్చిన ప్రసంగం నుండి ) ★

## చల్లా కొండయ్య కమిషన్

# పీఠాధిపతుల సూచనలు-ప్రభుత్వ కర్తవ్యం

చల్లా కొండయ్య కమీషన్ సూచనలు గందరగోళాన్ని సృష్టించాయి. హిందూ ధర్మ ఆరాధకుల మనస్సులలో తీరని అసంతృప్తి జ్వాలలు చెలరేగాయి. పవిత్రమైన దేవాలయాలలో పనిచేస్తున్న అర్చకులు బజారున పడవలసి వచ్చింది. ఈ సిఫార్సులు వైదిక ధర్మ సంస్కృతికి తీరని ప్రమాదం తెచ్చిపెడుతాయని పీఠాధిపతులు భావిస్తున్నారు. హిందూ ధర్మ పరిరక్షణ సంస్థలు ఆందోళనను వ్యక్తం చేస్తున్నాయి. తత్ఫలితమే ది 16-11-86 న భారీ ఎత్తున విజయవాడలో జరిగిన ఆత్మావలోక దినం. ఈ విషయం అంత తేలికగా త్రోసివేయవలసినది కాదు. అత్యధిక సంఖ్యాకులైన హిందువుల మనోభిప్రాయములను పరిగణనలోనికి తీసుకొనకుండా ఏక పక్షంగా ప్రభుత్వం వ్యవహరిస్తే అనేక క్లిష్ట సమస్యలను ఎదుర్కొనవలసి వస్తుంది. కనుక ఈ విషయమును సమగ్రంగా పరిశీలించి, పూర్వాపరాలను దృష్టియందుంచుకొని సముచితమైన, అందరికి ఆమోదకరమైన, ముఖ్యంగా హిందూ ధర్మ ఆరాధకుల మనస్సులు గాయపడని విధంగా ఒక మంచి నిర్ణయాన్ని గైకొనడం ప్రభుత్వ ప్రధాన కర్తవ్యము. ఈ సందర్భమున వివిధ పీఠాధిపతుల అభిప్రాయములను సూచనలను వివరిస్తున్నాను. సహృదయంతో వాటిని ప్రభుత్వం స్వీకరించి వైదిక ధర్మానికి ఎట్టి హాని కలగని విధముగా న్యాయం చేకూరుస్తుందని ఆశిస్తున్నాను.

### శ్రీ శృంగేరిస్వామి

అర్చకుల హక్కులపై శ్రీ శృంగేరి పీఠాధిపతి శ్రీ భారతీతీర్థస్వామివారు వెలిబుచ్చిన అభిప్రాయములను జస్టిస్ కొండయ్య తమ నివేదికలో వక్రీకరించి అపార్థాలు కలిగించే విధంగా పొందుపరచినట్లు జగద్గురువుల అంతరంగిక కార్యదర్శి ఒక ప్రకటనలో పేర్కొన్నారు. హైద్రాబాద్‌లో జగద్గురువులను దర్శించుకోవడానికి జస్టిస్ కొండయ్య వచ్చినప్పుడు స్వామివారు తమ అభిప్రాయములను స్పష్టపరచేసి యిచ్చినప్పటికీ ఇలా జరగడం దురదృష్టకరమని చెబుతూ " ఆలయానికి అంకితమైన పరంపరలో శాస్త్ర విహితమైన యోగ్యత కలిగిన అర్చకులు తమ విధులు నిర్వహిస్తున్నంతకాలం వారి పారంపర్య హక్కులో ప్రభుత్వం జోక్యం చేసుకోవడానికి వీలులేదు. కాని పరంపరలో ఎవరైనా అర్హతలు లేనివారు వుంటే అన్ని అర్హతలు, యోగ్యతలు గల మరొకరికి బాధ్యతలు అప్పగించవచ్చు. అయితే సహజ హక్కులు గల అర్చకుడు యోగ్యతలు సముపార్జించిన తరువాత ఆయనకు తిరిగి ఆలయ హక్కు దత్తం చేయవలసి వుంటుంది. " అన్నారు.

### శ్రీ కంచిస్వామి

శ్రీ కంచి కామకోటి పీఠాధిపతులు శ్రీ చంద్రశేఖర సరస్వతీస్వామివారిని ఆంధ్రప్రదేశ్ దేవాదాయ మంత్రి ఇటీవల కలసినప్పుడు చెప్పిన విషయాలను స్వామివారి ప్రతినిధి శ్రీ టి. యస్. కృష్ణమూర్తి వివరిస్తూ "ఆలయాల అర్చనలు, ఆచార వ్యవహారాలలో మార్పులు తీసుకొని రావడం పెద స్వామివారికి సమ్మతం కాదు. అర్చకులకు వారి వారి సంప్రదాయాలలో శిక్షణ యివ్వవచ్చును. ఆలయ సంప్రదాయాలలో ప్రభుత్వం జోక్యం చేసుకొనరాదన్న సిద్ధాంతం మానవాళికే శ్రేయస్కరము " అని చెప్పారు.

* * *

## ముఖ్య గమనిక

1987 జనవరి 1 నుండి "శ్రీవాణి" సంవత్సర చందా 36 రూపాయలు. అయితే 1986 డిసెంబరు 31 లోగా రెన్యూవల్ చేసే పాత చందాదార్లు, క్రొత్తగా చేరే చందాదార్లు సంవత్సర చందా రు 33/- చెల్లిస్తే సరిపోతుంది, గమనించ ప్రార్థన.

మేనేజరు

"కొండయ్య కమీషన్ సిఫార్సులు ధార్మిక వ్యవస్థకు, ఆలయ వ్యవస్థకు మొత్తం సంప్రదాయానికే ప్రమాదకరమైనవి. అర్చకులకు, ట్రస్టీలకు, ధార్మికులకే గాక, సంప్రదాయాన్ని విశ్వసించే వారందరికీ హాని కలిగించేవిగా వున్నాయి. పీఠాధిపతులకు సహితం నియమాలు పెడుతున్నారు. యజ్ఞ యాగాది క్రతువులు కూడా ముందుగా దేవాలయ శాఖకు చెప్పి చేయాలనడం శోచనీయం. ధార్మిక కార్యక్రమాలకు కూడా ముందుగా ప్రభుత్వ అనుమతి కావాలనడం విచారకరం. ఆచార వ్యవహారాలను దెబ్బతీసే అంశాలు యిందులో ఎన్నో వున్నాయి. వైదిక ధర్మ సంప్రదాయాలను దెబ్బతీసే అంశాలు కూడా వున్నాయి. ఇదేదో కేవలం అర్చకుల సమస్య అనుకోవడం సరికాదు. వాస్తవానికి నిజంగా బాధపడవలసినవారు ప్రజలే. ఆలయాలు నిర్మించింది బ్రాహ్మణులు కాదు. ఆస్తులు బ్రాహ్మణ్యం యివ్వలేదు. అనేకమంది రాజులు ప్రసిద్ధ దేవాలయాలను నిర్మించి, ఆస్తుల నిచ్చి, అర్హులైనవారిని అర్చకులుగా నియమించి, హిందూ ధర్మ ప్రచారమునకు ఎంతో కృషి చేశారు. హిందూ ధర్మ పరిరక్షణే ఆనాటి రాజుల పరమావధి. ఆనాడు కుల వైషమ్యాలకు తావులేదు. ఏకాత్మ భావన వుండేది. అయితే ఈనాడు అంతా కుల దృష్టే ప్రబలుతున్నది. ' ఇది అత్యంత ప్రమాదకరం ".

—శ్రీ త్రిదండి రామానుజ జయ్యర్‌స్వామి
శ్రీ వైష్ణవ పీఠాధిపతి

" బ్యాంకులు, కర్మాగారాలవలె దేవాలయాలను జాతీయకరణ చేయాలనుకోవడం సరికాదు. దేవాలయాల విశిష్టత అత్యంత ప్రముఖమైనది. సంస్కృతికి రక్షణలు ఆలయాలు. విదేశీయుల పాలన రోజుల్లోకూడా మన సంస్కృతి నిలవడానికి ఆలయాలే ప్రధానమైనాయి. జాతిని, ఆలయాలను విడదీయడానికి వీలులేని సంబంధం ఉన్నది. ఆలయాలకు సహాయం చేయడం పోయి, ఆక్రమించాలనుకోవడం మనస్తాపం కలిగిస్తోంది. సహాయానికి అడ్డువచ్చిన సెక్యులర్ విధానం ఆక్రమణ విషయంలో అడ్డం రావడంలేదు కాబోలు. ప్రభుత్వ విరుద్ధ నీతి ఇది. ముస్లిం ధర్మాల విషయంలో గాని, క్రైస్తవుల ధర్మాల విషయంలోగాని ప్రభుత్వం చేయి పెట్టడం లేదు. హిందూ ధర్మంమీదనే చేయి పెట్టడానికి సిద్ధపడుతున్నారు. మనం ఉదాసీనులు కావడమే అందుకు కారణం. ప్రజల్లో చైతన్యం రావాలి. ధర్మవిరుద్ధ కార్యక్రమాలు జరిగేటప్పుడు ప్రజలు జాగృతమై రక్షించుకోవాలి. ధార్మిక స్వాతంత్ర్యం కావాలి. ధార్మికులు, పండితులు, మఠాచార్యులు, ధర్మాభిమానులతో ఏర్పాటైన స్వతంత్ర ధార్మిక సంస్థక్రింద ఆలయాలు ఉండాలి. ఆ సంస్థకు ప్రభుత్వం సహకరించాలి. "

— శ్రీ విశ్వేశ్వర తీర్థస్వామి
ఉడిపి పెజావర్ పీఠాధిపతి

" నవగ్రహాలతోపాటు దశమగ్రహం కూడా పట్టిందట. తారక రామానందస్వామి (ఎన్. టి. ఆర్. కు) కి గ్రహాలు పట్టాయి. ఈ కమీషన్‌లో నన్ను సభ్యునిగా ప్రభుత్వం నియమించగా, ఐదు సమావేశాలకు హాజరయ్యాను. అయితే కమీషన్ పునర్ నిర్మాణం జరిగినప్పుడు నా పేరును తీసివేసినట్లుగా, కనీసం మర్యాదకోసమైనా నాకు చెప్పలేదు. కమీషన్ సిఫార్సుల కాపీలనైనా నాకు పంపలేదు. లోగడ కమీషన్ తీరుపట్ల కొన్ని అభ్యంతరాలు తెలిపాను. రాజీనామా మాత్రం చేయలేదు. నన్ను తొలగించినట్లుగా వారు చెప్పనూలేదు. ఒక పత్యాయం, ముందే సిద్ధం చేసి తీసుకొనివచ్చిన నివేదిక

లోని కొన్ని అంశాలను చదువమని కమీషన్ సభ్యుడైన శ్రీ అన్నారావు ఇవ్వడం ద్వారా నన్ను అవినీతిపరుడ్ని చేయాలని ప్రయత్నించారు. శ్రీ అన్నారావు ఉండే కమీషన్‌లో నా సభ్యత్వంపట్ల అభ్యంతరాన్ని తెలియపరిచాను. ఇటువంటి కమీషన్ ఏర్పాటువలన సత్ఫలితాలు రావని, తలనొప్పి తెచ్చుకోవడమే అవుతుందని ఆనాడే ముఖ్యమంత్రిని హెచ్చరించాను. విద్యుత్తును సరీగా వాడుకొనకపోతే అది దహించి వేస్తుంది. అర్చకులు ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజిలద్వారా రమ్మనమని కోరడం కంటే దౌర్భాగ్యం మరొకటి లేదు. అర్చకత్వం ఆనూచారంగా రావలసిన హక్కు – తొలుత దైవాన్ని నిలిపిన వారినుంచి ఆ హక్కు లభిస్తుంది."

— శ్రీ త్రివిక్రమ రామానంద భారతీస్వామి
కుర్తాళం పీఠం

"ఎన్నికల ప్రణాళికలో లేని అంశం తీసుకున్నారు. ఈ అంశంపై ప్రజాభిప్రాయం తీసుకోవాలి. పీఠాధిపతులు పాద కానుకలు తీసుకోరాదంటున్నారు. ప్రభుత్వంలో ఉన్నవారికి మాత్రం హస్త కానుకలు (లంచం) కావాలి. మఠాధిపతులు ప్రభుత్వంలో ఉన్నవారి పాటకు వంత పాడాలనడం సరికాదు."

— శ్రీ యతిరాజు జియ్యర్‌స్వామి
పెరుంబుదూర్ పీఠాధిపతి

"దైవంమీద విశ్వాసం లేనివారిని అడిగి అభిప్రాయాలను తెలుసుకొని, ముందే తీర్మానం చేసుకొని, వాటిని సిఫార్సుల రూపంలో తెచ్చారు. భారతావనికి చేటు ఇతర మతాల వలన కాదు, దేవాదాయ ధర్మాదాయశాఖ వలననే ఎక్కువ హాని."

— లక్ష్మణ యతీంద్రులు

* * *

## ఎన్. టి. ఆర్. కు విజ్ఞప్తి

పీఠాధిపతుల సూచనలను, హిందువుల మనోభిప్రాయాలను పరిగణనలోనికి తీసుకోవడం ప్రస్తుత స్థితిలో

## ఆర్ద్ధేశ్వరం

నీవెవరో తెలియనప్పుడు
ఈ ప్రపంచాన్ని చూసి
ఆనందించాను
నిన్నుగురించి విన్నాక
నా ఆనందం క్షణికమని గ్రహించాను
నిన్ను అందుకోవాలని
మనసు ఉవ్విళ్ళూరుతోంది
క్షరంలో, అక్షరంలో
అవ్యయంగా ఉన్నావన్న నిన్ను
దర్శించడానికి
తాపత్రయపడే నన్ను చూడు
నాకు దివ్య నేత్రాలు లేవు
ప్రకృతిని నీవు వశం చేసుకుని
నన్ను ప్రకృతి వశం చేశావు
నీ మాయను
వలలా నా మీదకు విసిరావు
చిక్కి, సగమై నేనున్నా
గుర్తించే సర్వజ్ఞత నీదైతే
అందరిలో నీవున్నా
అందుకోలేని అల్పజ్ఞత నాది !
నీవు చేయి అందించినా
పట్టుకోలేని స్థితి నాది
నీ కారుణ్యం, వాత్సల్యం ఉంటేనే
నా ప్రయత్నానికి అర్థం
లేకుంటే నా బ్రతుకే వ్యర్థం !!

– యస్. టి. విమల

## రాజకీయాలు

" మన దేశంలో అనేక సమస్యలకు కారణం రాజకీయ రంగంలో విశృంఖల విహారం చేస్తున్న పచ్చి అవకాశవాదమే. జాతిని నడిపిస్తున్న వారిలో రాజకీయ రంగములో పనిచేస్తున్నవారిలో ఎక్కువ మంది నైతిక ప్రవర్తనా నియమావళిని ఖాతరు చేయడం లేదు. సిద్ధాంతాలు లేని రాజకీయాలు కారణంగా మన జాతి జీవనంలో దాపురించిన దోషాలు మనకొక శాపంగా పరిణమిస్తున్నాయి. ఈ దోషాలనుండి విముక్తి పొందడానికి ఒకే ఒక మార్గం - వ్యామోహాలకు లొంగని, అవరోధాలకు రాజకీయాలు ".

– శ్రీ దీనదయాళ్ ఉపాధ్యాయ

సముచితం. నా స్వీకుల మాటలను నమ్మి పవిత్రమైన హిందూదేవాలయ వ్యవస్థను పాడుచేయ ప్రయత్నించడం ఏ మాత్రం విజ్ఞత కాదు, సముచితం కాదు, క్షేమం అంత కన్నా కాదు. అనాలోచితమైన, ఆచరణయోగ్యంకాని, ధర్మవిరుద్ధమైన, తొందరపాటు నిర్ణయాల వలన ప్రయోజనం చేకూరకపోగా, ప్రమాదం వాటిల్లుతుంది. తొందరపాటుతనం వలన అరిష్టాలతోపాటు అనర్థాలు కూడా సంభవిస్తాయి. అశాంతి చెలరేగి అవాంఛనీయమైన సంఘటనలు జరుగుతాయి. ఈ వ్యవస్థలో కొన్ని లోపాలు ఉన్న మాట వాస్తవమే. అక్రమాలు జరుగుతున్న మాట కూడా వాస్తవమే. ఎలుకలు ప్రవేశించాయని, మొత్తం ఇల్లునే తగులపెట్ట ప్రయత్నించడం వివేక లక్షణం కాదు గదా ! కనుక ఈ విషయమై సమగ్రచర్చ జరగాలి. పూర్వాపరాలను విచారించాలి. పండితులను, మఠాధిపతులను, పీఠాధిపతులను, ధర్మసంస్థల ప్రతినిధులను ఆహ్వానించి చర్చలు జరగాలని శ్రీ ఎన్. టి. ఆర్. గారికి ప్రత్యేకంగా విజ్ఞప్తి చేస్తున్నాను.

ఈ సందర్భమున రావణాసురునికి మారీచుడు, విభీషణుడు చేసిన హితవును తమ దృష్టికి తీసుకొని రాదలచాను.

" సులభాః పురుషా రాజ స్సతతం ప్రియవాదినః
అప్రియస్య చ పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః"

" హే రాజన్ ! నిరంతరము మనకు ప్రియమును చెప్పునట్టి మనుష్యులు కోకొల్లలుగా లభించుదురు. కాని మనకప్రియమైనను, మన హితమునుకోరి మాటలు చెప్పువారు, చెప్పినను వినువారలు లభించుట లోకమున అరుదు. " అని మారీచాశ్రమమునకు రావణుడు వెళ్ళి సీత విషయమై తన కోరికను ఎఱుక పరచినప్పుడు మారీచుడు పై హితవును చెబుతాడు. శ్రీరామచంద్రుని శక్తి సామర్థ్యములను వివరిస్తాడు. అతనితో విరోధము సర్వనాశనానికి దారి తీస్తుందని హెచ్చరిస్తాడు. ఇదే విధమైన హితవును విభీషణుడు కూడా చేస్తాడు. నిన్ను నమ్మికొనిన రాక్షస సమాజం మొత్తం నశించిపోతుందని హెచ్చరిస్తాడు. అయితే రావణుడు వారిరువురి హితవును లెక్కచేయక పోవడం వలన చివరికి ఏం జరిగిందో అందరికీ తెలుసు.

కనుక హిందూదేవాలయాల విషయంలో వివేకంతో పాటు, విజ్ఞతను కూడా ప్రదర్శించి సముచితమైన. ధర్మబద్ధమయిన నిర్ణయాలను గైకొని ప్రశాంత వాతావరణమును ఏర్పర్చుటకు అవసరమైన చర్యలను సత్వరమె తీసుకుంటారనే విశ్వాసంతో, ఆశతో ఈ చిన్న హెచ్చరికను తమకు చేయ సంకల్పించుకున్నాను. సహృదయంతో స్వీకరిస్తారని విశ్వసిస్తున్నాను.

కొముర్గిరి కృష్ణమోహనరావు

# మహామానవుడు రవీంద్రుడు

రవీంద్రుడు భారతదేశంలో పుట్టినప్పటికీ దాని ఎల్లలు దాటి వసుధైక కుటుంబానికి చెందిన విశ్వకవిగా అంతర్జాతీయ ఖ్యాతి నార్జించాడు. అందుకనే ఈ రోజు మనతోపాటు ప్రపంచ దేశాలన్నీ ఆయన 125 వ జన్మ దినోత్సవాన్ని సంవత్సరం పొడుగునా వైభవోపేతంగా జరుపుకుంటున్నాయి.

రవీంద్రుని వ్యక్తిత్వం సర్వతోముఖం. సాధారణంగా ఒక వ్యక్తి ఒకటి రెండు విషయాల్లో పరిపక్వత కొరకు ప్రయత్నించడం సహజం. కానీ రవీంద్రుడు దాదాపు అన్ని సాంస్కృతిక వ్యాసాంగాల్లో ఉండటం విశేషం. ఈ నాటికీ ఆయనను గురించి ప్రపంచానికి తెలిసినంతగా మరే వ్యక్తిని గురించీ తెలియదు. రవీంద్రుడు ఒక విజ్ఞాన ఖని. త్రవ్వినకొద్దీ ఇంకా త్రవ్వవలసి ఉంటుంది. ఆయన గురించి వ్రాసే కొద్దీ ఇంకా వ్రాయవలసింది ఎంతో మిగిలి పోతుంది. ఇట పరిమితమైన పరిధిలో రవీంద్రుని సర్వతోముఖ వ్యక్తిత్వాన్ని పరిశీలింప ప్రయత్నిద్దాం.

## కవిగా రవీంద్రుడు

చిన్ననాటనే రవీంద్రుడు కవితా వ్యాసంగం మొదలు పెట్టాడు. మాతృభాష అయిన బెంగాలీలో విద్య నభ్యసించి తన భావాలను నిర్భయంగా ప్రచురించసాగాడు. చాలాకాలం రవీంద్రుని రచనలను పత్రికలు ప్రచురించ లేదు. ఆయన భాష, భావాలు ఆ నాటి సంప్రదాయ విరుద్ధంగా ఉండటంవల్ల చాలామంది పత్రికా సంపాదకులు ఆయన రచనలను నిరాకరించెడివారు. తన ఈ అనుభవాన్ని గుర్తు పెట్టుకొని తరువాత శాంతినికేతన్‌లో తన విద్యార్థులు నిరుత్సాహ పడకుండా వారి రచనలను రవీంద్రుడు ప్రోత్సహించేవాడు. తన ఎనిమిదవ ఏట ప్రారంభించిన సాహిత్య వ్యవసాయాన్ని రవీంద్రుడు జీవితాంతం బహుముఖీనంగా కొనసాగించాడు. ఆ నాటి బెంగాలీ సారస్వతంలో సర్వతోముఖంగా రవీంద్రుడు తనదైన ఒక శైలిని ఏర్పరచుకున్నాడు.

వి. వి. థోణ్ పె

## అనువాద సాహిత్యం – రవీంద్రుడు

రవీంద్రునికి మధ్యవయస్సు వచ్చువరకు బెంగాలీ భాషలో సరియైన గుర్తింపు రాకపోవడం వల్ల తన రచనలను ప్రపంచ భాషయైన ఇంగ్లీషులోనికి అనువాదం చేయ దలిచాడు. ఇంగ్లండులో తాను కలుసుకోబోవు ఏట్స్ (Yeats) వంటి ఆంగ్ల మిత్రులు, కవులు, రచయితలకు అందుబాటులో ఉండాలని ఓడలో ప్రయాణించే కాలంలోనే 'గీతాంజలి' కి స్వేచ్ఛానువాదం చేశాడు. ఆంగ్ల సాహిత్య ప్రపంచంలోనికి ప్రప్రథమంగా ప్రవేశపెట్టబడిన రచనలకు ముగ్ధుడై ఏట్స్ అమితానందభరితుడయ్యాడు. రవీంద్రుడు "గీతాంజలి" కి నోబెల్ బహుమతి పొందడానికి కారకుడయ్యాడు. ఇందువల్ల సాహిత్య ప్రపంచంలో స్వేచ్ఛానువాదానికి ఒక గౌరవస్థానం ఏర్పడింది.

## వేదాంతిగా రవీంద్రుడు

ఈ ప్రోత్సాహాన్ని పురస్కరించుకొని 1912-13 సం॥లలో రవీంద్రుడు అమెరికాలో అర్బానా విశ్వవిద్యాలయ ప్రశాంత వాతావరణంలో "హార్వర్డ్ వేదాంత ఉపన్యాసాలు" ఆంగ్లంలో తయారుచేసి తరువాత "సాధన" అను పుస్తకంగా ప్రచురించాడు. అప్పటికి అతడు తత్వజ్ఞుడుగను, కవితా దృష్టిగల వేదాంతిగను గుర్తింపు

పొందాడు. పుట్టుకతో బ్రహ్మసమాజానికి చెందిన వాడైనప్పటికీ ఉపనిషత్ సారం, హిందూ వేదాంతం ఆయనలో అంకురించి విశ్వమానవ సౌభాత్రపు దృష్టిని వికసింపచేశాయి. అయినను సన్యాసం, వైరాగ్యం ఆయనను ఆకర్షించలేదు. ఆయనలోని కవితా దృక్పథం ఆయనయందు సౌందర్యారాధనను అంకురింపజేసింది. భౌతిక వాదానికి ఆధ్యాత్మిక దృక్పథాన్ని మేళవించింది. ఆయనలో బ్రహ్మజ్ఞానాన్ని మేల్కొలిపింది. అద్వైత సిద్ధాంతమందు నమ్మకం కలుగ జేసింది. నిర్గుణ పర బ్రహ్మను సగుణ, సాకార సౌందర్యంలో చూచేట్టు చేసింది. ప్రపంచంలోని ముఖ్య మతాల సారమే తన తత్వచింతనగా గ్రహించునట్లు చేసింది. దైవచింతన, మానవత, భూత దయ వంటి అనేక విషయాలు రవీంద్రుని భావుకతతో మేళవింపబడుట వల్ల అతని దృక్పథం సాంప్రదాయిక వేదాంత సిద్ధాంతాలకు భిన్నమై ప్రత్యేకతను సంతరించు కొంది.

## సౌందర్యారాధన– రవీంద్రుడు

ఈ ఆధ్యాత్మిక దృష్టి రవీంద్రుని గొప్ప సౌందర్యా రాధకునిగా మార్చింది. భౌతిక, మానసిక, ఆధ్యాత్మికా నందాన్ని ఆయన సౌందర్యం ద్వారా పొందగల్గాడు. సృష్టి లయలోని సౌందర్యాన్ని దర్శించి తన కవిత్వంలో ప్రతిసృష్టిని గావించాడు. వీటిని సొంత మాటలలో సామాన్య మానవునికి అర్థమయ్యే విధంగా చెప్పడానికి రవీంద్రుడెంతో ప్రయత్నించాడు. అందుకని రవీంద్రుని కవిత్వం చదువుతుంటే దాన్లో ఎంతో ఉత్కృష్టభావం ఉందనిపిస్తుంది. కానీ దానిని వివరించాలంటే మాటల కందదు. అది అనుభవైకవేద్యం. ఆయన కవిత్వం గొప్పదన్న విషయం అందరూ అంగీకరింపక తప్పదు. కానీ అది ఎందుకు గొప్పది అని విశ్లేషించి చూద్దామన్న ప్రయత్నం చేస్తే మాత్రం అంతుపట్టదు. ఒక అవ్యక్త ఆనందం, ఒక అతీత మానసిక తృప్తి, ఒక అసంపూర్ణ భావన, ఏదో సాధింపగలనన్న సంతృప్తి, ఇవన్నీ కలిసి మనల్ని ఒక విసూత్న విహాయసంలో విహరింప చేస్తాయి. దీనినే తత్వవేత్తలు, సాహిత్యవిమర్శకులు మార్మికత (గూఢత్వం) (Mysticism) అని అంటారు.

## కారుణ్యమూర్తి - రవీంద్రుడు

రవీంద్రుని రచనల్లో కరుణరసం అంతర్లీనంగా ఉంటుంది. ఆగర్భ శ్రీమంతుడైనప్పటికీ బీదసాదల ఎడ ఆయన ప్రేమ అపారం. తండ్రి దేవేంద్రనాథ్ రైతుల వద్దనుండి శిస్తు సేకరణ బాధ్యత రవీంద్రునకు అప్పగించి నపుడు, గ్రామసీమలకు ప్రయాణమై స్వయంగా వారి కష్టనష్టాలను అర్థం చేసుకొని కొన్ని సందర్భాలలో వారి దగ్గరనుండి శిస్తు వసూళ్ళకు బదులు తానే ధన సహాయం చేసి పేదల పాలిటి పెన్నిధి అనిపించుకున్నాడు. అటు వంటి సందర్భాల్లో ఆయన మనసు ఆర్ద్రమై కరిగి రస ప్రవాహమై అక్షర రూపం ధరించింది. ఆయన రచనల్లో కరుణ అంతర్లీనంగా ఉంటుంది. రవీంద్రుడు కథల్లో సాంఘిక దురాచారాలను ఖండించి, నాటకాల్లో అమాను షత్వాన్ని ప్రతిఘటించి వాటికి బలి కానున్న వ్యక్తుల ఎడ కరుణతో కూడిన సానుభూతిని వ్యక్తంచేస్తాడు.

## కథారచయితగా రవీంద్రుడు

శైశవంలో దాదులు చెప్పే కథలను విని, బాల్యంలో అనేక కథలను స్వయంగా చదివి, యువకుడయ్యే సరికి కథా రచయితకు అవసరమైన సాహిత్యపు అనుభవాన్ని గడించాడు. యౌవనంలోనే "బిచ్చగత్తె" (Bhikarini) అనే కథను వ్రాసి రవీంద్రుడు కథారచనకు శ్రీకారం చుట్టాడు. చరమదశవరకు కథారచనా వ్యాసంగాన్ని కొన సాగించి ఉత్తమ కథారచయిత అయ్యాడు. "సెలవలు" (Home Coming), "బాలుడైన నా ప్రభూ" (My lord the Baby), "కాబూలీవాలా," "శుభ" వంటి కథలు కరుణరస ప్రధానములు.

రవీంద్రుని కథలు ఆనాటి సాంఘిక ఆచారాలను చిత్రించాయి. "నాయంజోర్ బాబులు" వంటి కథలలో నాటి అంతస్తుల్ని, హోదాలను రవీంద్రుడు విమర్శించాడు.

మంచి నేర్పుతో రవీంద్రుడు కట్టు కథలను కూడ వ్రాశాడు. "అనగనగా ఒకరాజు", "పేకముక్కల రాజ్యం", "బ్రతుకా-చావా ?" వంటి కధల్లో కిన్నెర, కింపురుషులకు బదులుగా నిత్యజీవితంలో చూచే సామాన్యులను పాత్రలుగా చిత్రించాడు. వారు చేసే పనులు, వారు పడే ఇబ్బందులు మనల్ని నవ్వేట్టు చేస్తాయి. రవీంద్రుని హాస్యం హాందాగా ఉంటుంది. విమర్శ ఘాటుగా ఉన్నా భరింపరానిదిగా ఉండదు చాలా కథలు, కథానికలు విషాదాంతాలు. మనస్సులను కలవరపరచి మనలోని లోటుపాట్లను సర్దుకునేట్టు చేయడానికి ప్రయత్నిస్తాయి. మనలో పరివర్తనను తెస్తాయి.

## నవలా రచయితగా రవీంద్రుడు

రవీంద్రుడు తన నవలల్లో కూడా కథల్లోవలెనే సాంఘిక దురాచారాలను ఖండించాడు. ప్రకృతి ప్రాధాన్యత ఎక్కువ. వీటిలో కూడా కరుణరసం అంతర్లీనంగా ఉంటుంది చాలా నవలలు విషాదాంతాలు.

"రాజర్షి" రవీంద్రుని మొదటి నవల. ఆ నాటి నవలా సంప్రదాయానికి దగ్గరలో ఉంటుంది. తరువాత వ్రాసిన "చోకర్ బలి", "పడవ మునక" (నౌకా డూబె) అను నవలలు రవీంద్రునికి నవలా రచయితల్లో స్థిరమైన స్థానాన్ని కల్పించాయి. "గోరా" రవీంద్రుని ప్రౌఢ రచన అనుటలో సందేహం లేదు సమకాలీన హిందూ దేశపు రాజకీయ వాతావరణాన్ని, అప్పటి హిందూ సంఘంలో వస్తున్న మార్పుల్ని దీనిలో స్పష్టం చేశాడు. రవీంద్రుడు "ఇంటా - బయటా" (Home and the World) లో క్రొత్త రీతిని అవలంబించి కథను చెప్తాడు. ఇందలి పాత్రలు వేర్వేరుగా తమ తమ అనుభవాల్ని తెలియజేయడంలో ప్రత్యేకత కనబడుతుంది. "యుగ మాయ", "శేషర్ కవిత" అను నవలల్లో రవీంద్రుని రచనా సామర్థ్యాన్ని గమనింపవచ్చు.

## రవీంద్రుని రూపకాలు - నాటకాలు

కథానికలు, నవలల్లో వలెనే రవీంద్రుని రూపకాలు నాటకాల్లో కూడ కరుణరసం స్పష్టంగా గోచరిస్తుంది.



### నవంబరు రంజనిమాల సమాధానాలు

అడ్డము : 1. ఎలనాగ నయనాల కమలాలలో దాగి 7. చేయి చేయి 8. మెరుపు వెలుగు 11 సేయగనే 12. గనులు 13. నగు 14. చెలికాడు 16. సన్నజాజి 17. తల 20. రాగమయి రావే 22. చూ డు మ దే 24. చిన్నమాట 25. కలకలము 26. పూవు నిలువలేదులే ఇది నిజము 29. సరసలో సరికొత్త వధువులో తొలి.

నిలువు : 1. ఎదలో మెదిలే చెలికాని చూపు 2. నయనాలు 3. లడాయి చేసే స్త్రీ జాతి రాక మానదు 4. లోకమెరుగని 5. గిల్లి కజ్జాలు తెచ్చుకొనే 6. చూపులు 9. గుసగుసలన్నీ 10. నేనే ఓడి 15. కారులో 19. సరాగాల 21. కల 22. మనువు 27. జడలో 28. సిలి.



రవీంద్రుడు "ఛండాలిక" లో సంఘ మూఢాచారాల్ని రవీంద్రుడు నిశితంగా ఖండిస్తాడు. "చీకటి గది లోని రాజు" (King of the Dark Chamber) లో ప్రతీక వాదం (Symbolism) కనబడుతుంది. భగవంతుని రాజుగా వ్యవహరిస్తాడు. ఈ రచనలో ఆధ్యాత్మికత ప్రతిబింబిస్తుంది. "త్యాగం" (Sacrifice) రవీంద్రుని తొలి రూపకాల్లో అగ్రస్థానం అలంకరించింది. దీనిలోని రఘుపతి పాత్రను ధరించి ప్రేక్షకులను ఆకట్టుకొనేట్టు కలకత్తాలో ఒకసారి అనన్య సాధారణంగా నటించాడు. "వైకుంఠుని పత్రం", "రాజు-రాణి", "శాపం", "మాలిని", వంటి అనేక రచనలు చేశాడు. "నరకవాసం", "సహగమనం", "ప్రాయశ్చిత్తం" వంటి రూపకాలు రవీంద్రునికి రూపక రచయితగా విశిష్ట కీర్తి నార్జించాయి. "కర్ణ - కుంతి

సంవాదం," "గాంధారి ఆవేదన," "శకుంతల" పౌరాణిక కథావస్తువులు. "రాజా", "పోస్టాఫీస్" వంటి కొన్ని వచన రూపకాల్లో ప్రసిద్ధి నొందాయి. ఇవి కాక రవీంద్రుని రూపకాలు ఇంకా చాలా ఉన్నాయి.

## రవీంద్రుని సంగీతం

అవకాశం దొరికినప్పుడల్లా రవీంద్రుడు తన నాటకాల్లో, రూపకాల్లో సంగీతాన్ని ప్రవేశపెట్టాడు. తత్త్వాలు, భజనలు, గీతాలు, వైష్ణవ ప్రార్థనలు వీటన్నిటినీ క్షుణ్ణంగా అర్థం చేసుకున్నాడు. దేశమంతటా పర్యటించి ప్రాంతంలోని ప్రత్యేక సంగీత బాణీని తన సృజనాత్మక సృష్టితో మేళవించాడు. పాశ్చాత్యుల రాగతాళాలను సాంప్రదాయక బెంగాలీ సంగీతంతో జతపర్చి అనేక ప్రయోగాలు చేసి రెండువేల కంటే ఎక్కువ పాటలు వ్రాశాడు. వీటిలో తనదైన ముద్ర కనపడటంవల్ల రవీంద్రుని పాటలను "రవీంద్ర సంగీత్" అని వ్యవహరిస్తున్నారు.

రవీంద్రుడు ఎంత గొప్ప కవియో అంత గొప్ప నవ్య వాగ్గేయకారుడు. కనుక ఆయన సంగీతం వంగదేశపు ప్రజలకు తలమానికమైనది.

రవీంద్రుడు తన పాటల గురించి ఒకసారి ప్రఖ్యాత విమర్శకుడు ఎడ్వర్డ్ థాంప్సన్‌తో ముచ్చటిస్తూ "తన పాటలతో తాను పరవశించి రసానందాన్ని అనుభవిస్తాను" అన్నాడు.

## చిత్రకారుడుగా రవీంద్రుడు

కవిగా, నటుడుగా, గాయకుడుగా, నవ్య వాగ్గేయకారుడుగా తన సృజనాత్మక శైలిని మలచుకొన్న రవీంద్రుడు చిత్రకారుడుగా కూడ రూపొందడంలో ఆశ్చర్యంలేదు.

ఆనాటి హైందవ కళారీతులను శాంతినికేతన్‌లో ప్రవేశపెట్టి నందలాల్‌బోస్, గగనేంద్రనాధ్, అవనీంద్రనాథ్ ఠాకూర్‌ల సహాయంతో హిందూ సాంప్రదాయక చిత్రకళలో ఒక నూతనత్వాన్ని ప్రవేశపెట్టాడు, రవీంద్రుడు. పాశ్చాత్యులు ఎదురు చూస్తున్న "మోడర్న్ ఆర్ట్"కు మన దేశంలో రవీంద్రుడు నాంది పల్కాడు. డెబ్భైఏళ్ళ వయస్సులో అప్రయత్నంగా ఈ కళారీతికి పోషకుడయ్యాడు. తాను స్వయంగా రెండువేలకు పైగా చిత్రాలను గీసి "చిత్రలిపి" అను ప్రత్యేక శైలిని ఏర్పరుచుకున్నాడు. ఆయన తన చిత్రాలను విదేశాల్లో ప్రదర్శించినపుడు నూతన చిత్రకళారీతిని అనుకోకుండా నిర్దిష్టమైన శిక్షణ లేకుండగనే రవీంద్రుడు ప్రవేశపెట్టడం పాశ్చాత్యులకు ఆశ్చర్యాన్ని కలిగించింది. దీనినే "నైరూప్య చిత్రకళ" (Abstract art) అంటారు.

ఇన్ని సాంస్కృతిక, సాహిత్య ప్రక్రియలందు ప్రవేశమున్న మహామనీషి రవీంద్రుడు. భారతదేశంలో ఒక నూతన విద్యావిధానాన్ని శాంతినికేతన్‌లో ప్రయోగాత్మకంగా అందజేశాడు.

## రవీంద్రుడు-విద్యావిధానం

రవీంద్రుని తండ్రి మహర్షి దేవేంద్రనాధ్ తన అంతిమ దశలో ప్రశాంతంగా కాలం గడుపుటకు శాంతినికేతన్‌లో ఉండగా, రవీంద్రుడు ఆ ఆశ్రమ వాతావరణాన్ని చవిచూచి, తన సృజనాత్మక జీవితానికి తగినదిగా గుర్తించి, డిశెంబర్ 1900 లో శాంతినికేతన్ లోనే స్థిర నివాస మేర్పచుకొన్నాడు. అనాటినుండి చివరవరకు రవీంద్రుని కళాత్మక జీవితానికి శాంతినికేతన్ నిలయమైంది.

ఆంగ్లేయులు ప్రవేశపెట్టిన ఆనాటి విద్యా విధానాన్ని నిరసిస్తూ రవీంద్రుడు శాంతినికేతన్, శ్రీనికేతన్ అను విద్యాకేంద్రాలను నడిపి మన దేశానికి స్వాతంత్ర్యానంతర విద్యావిధానం ఏ విధంగా ఉండాలో నమూనాగా చూపాడు. తరువాత ఉన్నత విద్యను ప్రవేశపెట్టి విశ్వభారతి అనే విశ్వవిద్యాలయాన్ని స్థాపించాడు. ఆయన తన మానవతావాదమునకు తగినట్లు శాంతినికేతనాన్ని అంతర్జాతీయ విద్యాకేంద్రంగా తీర్చిదిద్దాడు.

స్వేచ్ఛా వాతావరణం, సృజనాత్మక దృక్పథం, సాహిత్య, సాంస్కృతిక సేవ, మానవత్వపు విలువలను

కొనసాగించడం అనేవి శాంతినికేతన్‌లోని ఆదర్శాలు. ప్రపంచంలో అనేక ప్రాంతాలనుండి ఉపాధ్యాయులు, విద్యార్థులు విచ్చేసి నోబెల్ బహుమాన గ్రహీత, ప్రపంచ ప్రఖ్యాత కవియైన రవీంద్రుని సాహచర్యమును ఆశించారు. శాంతినికేతన్ జాతీయ, అంతర్జాతీయ విద్యా కేంద్రంగా మారింది.

## రవీంద్రుని జాతీయత-అంతర్జాతీయత

రవీంద్రుడు ఎంతగొప్ప జాతీయవాదియో అంతటి గొప్ప అంతర్జాతీయవాది. మహాత్మాగాంధీ ప్రవేశపెట్టిన సహాయ నిరాకరణ ఉద్యమాన్ని, అహింసా వాదాన్ని, సత్యాగ్రహాన్ని కొన్నాళ్ళు అవలంబించి తరువాత రవీంద్రుడు నిరసించాడు. వీటివల్ల స్వరాజ్యం సాధించు కొన్నప్పటికీ అటువంటి స్వరాజ్యాన్ని నిలబెట్టుకోవడం దుర్భరమౌతుందని హెచ్చరించాడు. కానీ ఆనాటి రాజకీయ పరిస్థితుల్లో నిరాయుధులైన మనకు వేరొకమార్గం లేదని మహాత్ముడు దేశాన్ని అహింసామార్గం పట్టించాడు. ఆనాటి స్వదేశీ ఉద్యమంలో ప్రముఖపాత్ర వహించిన రవీంద్రుడు నిరసనగా మరల శాంతినికేతన్‌లో తన జీవితాన్ని కళాసేవకు అంకితం చేశాడు. ఈనాడు రవీంద్రుడు చెప్పిన మాటలు ముమ్మాటికీ నిజమని నిరూపింపబడుతున్నాయి.

మన జాతీయతకు అంతర్జాతీయ దృక్పథాన్ని కల్పించాడు రవీంద్రుడు. నవసమాజ నిర్మాణానికి ఆయన విద్యాప్రచారాన్ని ముమ్మరంగా సాగించాడు. జాతీయ ఉద్యమంలో ఉన్న కొద్ది రోజుల్లో మహాత్మునికి కుడి భుజమై సత్యాహింసలను గూర్చి ప్రచారం చేశాడు. తన వాగ్ధాటివల్ల ఉద్యమాలను ప్రజ్వలింపజేశాడు. దేశంకొరకు గొప్ప త్యాగాలు చేశాడు. 1919లో జలియన్‌వాలాబాగ్ సంఘటనల ఫలితంగా బ్రిటిష్‌వారు తనకిచ్చిన "సర్" బిరుదుని తిరస్కరించాడు. అయినప్పటికీ అంతర్జాతీయత, మానవతాదృక్పథాలు గల రవీంద్రుడు బ్రిటిష్ వారి ఎడ స్నేహభావాన్నే ప్రదర్శించాడు. అండ్రూస్, ఎల్మ్‌హర్స్ట్, వింటర్ నిట్జ్ వంటి విశాలహృదయులతో రవీంద్రునకు కలిగిన స్నేహసంబంధాలు చిరస్మరణీయాలు. ఆనాటి ప్రపంచ రాజకీయాలను రవీంద్రుడు తీవ్రంగా విమర్శించి నప్పటికీ ఆయన ఆంగ్లేయ స్నేహితులవల్ల మంచిరోజులు రాగలవనే ఆశాజనక దృక్పథంతో తన అంతిమ దశను గడిపాడు ప్రపంచ పౌరుడుగా రవీంద్రుడు.

> **పారిశ్రామికీకరణ**
>
> "గ్రామాలను, గ్రామీణ కుటీర పరిశ్రమలను, చేతివృత్తులను నాశనం చేసేవిధంగా పారిశ్రామికీకరణ కొనసాగడం మంచిదికాదు. గ్రామాలకు, గ్రామీణ వృత్తులకు దోహదంచేసే పారిశ్రామికీకరణ నేడు కావాలి. ప్రభుత్వం చేతుల్లో పరిశ్రమలు కేంద్రీకృతమవుతే ప్రజలకు మేలు కలుగుతుందనే సోషలిష్టు సిద్ధాంతంలో నాకు నమ్మకం లేదు."
>
> — మహాత్మాగాంధీజీ

## విశ్వమానవుడు రవీంద్రుడు

ఇంగ్లాండునుండి 1880లో స్వదేశానికి రాగానే రవీంద్రుని జీవితంలో ఒక నూతన అధ్యాయం ప్రారంభ మైంది. బంకించంద్ర, అరవిందులు ఈయనలో ఒక ఆశాజ్యోతిని చూడగల్గారు. ఈయన మృదు మధుర కంఠం ప్రపంచంఅంతా మారుమ్రోగింది. యుద్ధభీభత్సానికి గురియై నిర్వీర్యమైన మానవాళికి రవీంద్రుడు ఉదయ భానుడయ్యాడు. నిరాశా నిస్పృహల తిమిరాన్ని పార ద్రోలాడు యాంత్రిక జీవితానికి తలఒగ్గుతున్న పాశ్చాత్యులను ఉత్తేజపరిచి మానవులుగా బ్రతుకుటకు అవసర మైన మనోనిబ్బరాన్ని నూరిపోశాడు. ఆనాటి ప్రపంచ రాజకీయాలలో భయాందోళనలు చెలరేగుతున్నా, భారత సాంస్కృతిక రాయబారిగా ప్రపంచయాత్ర చేసి జపాను నుండి అమెరికా వరకు జయభేరీలు మ్రోగించి విశ్వమానవ సౌభ్రాత్రానికి నాంది పలికిన మహామానవుడు రవీంద్రుడు. ఇటువంటి విశ్వకవికి ఆయన 125వ జన్మదిన సందర్భంగా నివాళులర్పించటం మానవులుగా మన కనీసధర్మం. ★

# తేలు

తేలు ని చూడని వాళ్ళు అరుదు. తేళ్ళలో 1000 రకాలున్నాయి. మన దేశంలో వాటిలో 86 రకాల తేళ్లున్నాయి. సాధారణంగా నల్ల తేళ్ళు 180 మిల్లీమీటర్ల దాకా పొడవు వుంటుంది. ఎర్ర తేళ్ళు 90 మిల్లీమీటర్లు దాటి ఎదగవు. నల్లతేలు కన్నా ఎర్రతేలులో విషం అధికంగా వుంటుంది.

తేలు విషంవల్ల విపరీతమయిన బాధ కలుగుతుంది. చిన్న పిల్లలు, రక్తపోటు వున్న పెద్దవాళ్ళు తేలు విషంతో మరణించటం కద్దు. మన దేశంలోని తేళ్ళు కుడితే మరణం ఎప్పుడో కాని సంభవించదు.

## తేలు పాముని తింటుందా ?

తేలు 25 సంవత్సరాలు దాకా బ్రతుకుతుంది. దీనికి 12 కళ్ళున్నా కేవలం చీకటి వెలుగులని మాత్రమే పోల్చుకోగలదు. పురుగులని జొద్దింకలని తింటుంది. పెద్ద తేళ్ళు 10 సెంటిమీటర్ల పొడవుగల పాముని తిన్న సందర్భాలున్నాయి. ఆహారాన్ని పట్టుకొని వళ్ళతో దాన్ని పిండి పిండి చేస్తుంది. పురుగులు, పామో ఎదురు తిరిగితే కుట్టి చంపుతుంది. తర్వాత దాని వంట్లోని ద్రవ పదార్థాలని తాగుతుంది. మాంసాన్ని తినదు. ఒకసారి ఒక తేలు మరొక తేలుని కూడా తినేస్తుంది. మొగ, ఆడ తేళ్ళ కలయిక అయాక రెండూ అలసిపోవటంతో సాధారణంగా ఆకలిగొన్న ఆ రెంటిలో బలవంత మయినది రెండోదాన్ని తినేస్తుంది. ఎక్కువగా మొగతేలే ఆడతేలుకి ఆహారమవుతుంది.

ఆడ తేలు వంట్లో గుడ్లు పొదగ బడతాయి. 3 నుంచి 90 దాకా పిల్లలని పెడుతుంది తల్లి. తెల్లగా ఉండే పిల్లలు ఒక్కొక్కటీ ఓ సెంటీమీటరు పొడవు వుంటుంది. పిల్లలకి శరీరం గట్టిపడేదాకా తల్లి వీపుమీద ఎక్కి కూర్చుంటాయి. తల్లి నోటి దగ్గరకి పొరబాటున వెళ్తే వాటిని తల్లి స్వాహా చేస్తుంది. 10 నుంచి 16 రోజుల తర్వాత మిగిలిన పిల్లలు ఆహారాన్ని సంపాయించుకుంటూ తమ దోవన తాము వెళ్ళిపోతాయి.

మనకు తెలియని ప్రపంచం

మల్లాది వెంకటకృష్ణమూర్తి

ఎండాకాలంలో చల్లబడ్డాక, వర్షాకాలంలో వర్షం వెలిసాక తేళ్ళు బయటికి వస్తాయి.

తేలు విషానికి విరుగుడుగా అనేక ఇంజక్షన్లు దొరుకుతాయి మార్కెట్లో. తేలు కుట్టినచోట కత్తితో గాయం చేసి, విషపూరిత రక్తాన్ని నోటితో పీల్చి, పొటాషియం పెర్మాంగనేట్ తో గాయాన్ని కడిగితే త్వరగా గుణం కనిపిస్తుంది. 

# పూలు తగలపెట్టొద్దు

( గత సంచిక తరువాయి - 3 )

— వాణీ రంగారావు

కట్టుకుంది సాదాసీదా నేతచీర. నీలంమీద సన్నటి నల్లచుక్కలున్నవి. నల్లని జాకెట్టు. తీర్చిన కనుముక్కు తీరు. బారెడు జడా. సౌందర్యం కాల్చేది కాకపోయినా కంటిని ఆకట్టుకుంటుంది. పల్లవిని ఒక్కసారి చూసినవాళ్ళకి గుర్తుండిపోతుంది. నిశితంగా పరిశీలిస్తున్నాడాయన.

' అనుకున్నామని జరగవు అన్నీ అనుకోలేదని ఆగవు కొన్ని ' అవును కొన్ని కొన్ని మన సంకల్పం లేకుండానే కాలం తన గమనంతోపాటు సంభవం చేస్తుంటుంది. కొన్ని మనం అనుకున్నా సంకల్పం ఎంత బలీయంగా ఉన్నా జరిగించడం అనేది మన చేతుల్లో ఉండదు.

" రవీ ! ఇంకా ఎన్నాళ్ళుంది నీకక్కడ డ్యూటీ."

" రేపటితో అయిపోతుంది మావయ్యా "

" మరయితే ఇంటికెళ్దామా ! "

" లేదు మావయ్యా ఇక్కడ పల్లవిగారికి కొన్ని చిక్కులున్నాయి. ముసాఫిర్‌కి రావలసిన ఇన్సూరెన్సు, గ్రాట్యుటీ, ఆక్సిడెంటయిన లారీ వాళ్ళివ్వాల్సిన డబ్బూ, చాలా రావాలి. ఆ పన్లున్నాయి. కాస్త ఆ పన్లు చూసుకుని అయిదారు రోజుల్లో వస్తాను. " అన్నాడు రవి.

" వాళ్ళ వాళ్ళెవరూ లేరా ! "

" లేరు మావయ్యా. ఉన్నవాళ్ళు ఈవిణ్ణి రాబందుల్లా పీక్కుతినే వాళ్ళే. " అతని మాటల్లో ఎక్కడా వంచన కనిపించలేదాయనకి.

పల్లవి మూడు కాఫీలు ట్రేలో తెచ్చింది. " ఇదిగో . డికాక్షన్ తక్కువ తాగుతారుగా. " అంటూ ఓకప్పు రవికిచ్చింది.

ఇన్నేళ్ళ దగ్గరితనంలోనూ ఈ విషయం తనకుతెలీదు అనుకున్నాడాయన. కొన్ని విషయాలు ఒకరిపట్ల ఒకరికి అత్యంతాభిమానం ఉంటేగానీ తెలియవు. కొంత ప్రత్యేకమైన ఆప్యాయత, ప్రేమ ఉంటేనేగానీ శ్రద్ధాసక్తులుండవు.

" అయితే ప్రొద్దుపోయింది మరి వెళ్దామా! " కాఫీలు తాగాక లేచాడాయన.

" వెళ్తాం. పల్లవిగారూ రేప్రొద్దున్నే వస్తాను నేను. ఎనిమిదింటికి ఫీల్డు ఆఫీసరు గారి ఇంటికి వెళ్దాం. వస్తాం మరి. " అంటూ లేచాడు రవి.

" వెళ్ళొస్తాం తల్లీ ! " లేచాడు. పెద్దాయన.

" నమస్కారం బాబాయి. రేపు ఉంటే మీరిద్దరూ ఇక్కడికే భోజనానికి రావాలి. "

" అల్లాగేలే ! "

ఒక్కదాన్నీ అలా వదిలి వచ్చేస్తుంటే తనకే ఆదోలా ఉంది. ఆ నిశ్శబ్దంలో ఆ నిస్సహాయురాలి వేదన ప్రతిధ్వనిస్తోంది. ఇక రవికి.... ఆపైన ఆలోచించడం ఆయనకు ఇష్టంలేదు.

అయిదు రోజులూ ఉండిపోయాడాయన. రవి ఆలోచనలనిండా పల్లవే. దయ, జాలి, సానుభూతి అతన్ని

ఆమెనుండి విడిబడనీయడం లేదు. అంతే అంతకు మించి ఏమీ లేదని అర్థం అయిపోయింది పెద్దాయనకు.

అయితే ఈస్థితి ఇలాగే కొనసాగుతుందనీ, కొనసాగాలనీ రూలేం లేదు. మరోరూపం దాల్చడానికి ఎన్నో అవకాశాలున్నాయి. అన్నింటినీ మించి వ య సూ, అకర్షణా, ఒంటిరి తనం అవసరం. ఇవన్నింటినీ అధిగమించగల స్థితప్రజ్ఞ మామూలు మనుషుల్లో- వాళ్లు దేవతలైతే తప్ప- ఉండడం సాధ్యంకాదు. అదీ తెలుసాయనకు. అందుకే ఏదో ఒకటి చెయ్యాలి.

పల్లవి మీద ఆయనకూ అపరిమిత ప్రేమాభిమానాలు కలుగుతున్నాయి. ఆ అమ్మాయి నిస్సహాయత మీద ఆయనకు సంపూర్ణమైన సానుభూతిఉంది. అయితే వీటన్నింటికీ వరిష్కారం ఏమిటి ? ఇదే ఆయన మేథకు అందటంలేదు.

ఏది ఏమయినా రవిని తీసుకునే ఊరినించి వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు. లేని పని సృష్టించుకొని అయిగు రోజులూ ఉండి రవిని తీసుకునే బయలుదేరాడు.

పల్లవి ఒంటరిగా ఉండాలి అనే భావన రవిని ముల్లులా గుచ్చుతూనే ఉంది. నిజానికి పెద్దాయనకీ ఉంది అయితే ఆ ఒంటరితనం రవి ఎలా తీర్చగలడు ? ఆమెకు తోడుగా రవి ఉంటే తన బిడ్డ వనజ ఒంటరిదైపోదూ ! ఆ ఆలోచనే భరించలేక పోయాడు. తన బిడ్డ సౌఖ్యం, ఆనందం తరవాతే ఏదయినా.

రవి మావయ్యతో వచ్చాడేగానీ మనసులో ఏదో బాధగా ఉంది. మునుపటి ఉత్సాహం, మునుపటి మాటకారితనం కనిపించడంలేదు.

వనజకు విసుగ్గా ఉంది. ఎందుకలా ఉన్నావు అని అడిగితే, మౌనం తప్ప సమాధానం లేదు.

మునుపెన్నడూ వీళ్ళిద్దరినీ ఏం చేస్తున్నారు ? ఎలా ఉన్నారు అని పట్టించుకోని తండ్రి ఇంచుమించు వీళ్ళిద్దరి మధ్యనే ఉంటున్నాడు.

రవి మావగారింటికొచ్చి నాలుగురోజులైంది.

" రవీ ! ఈరోజు మనకంపెనీ వాళ్ళందరికీ ఓ చిన్న పార్టీ అరేంజ్ చేశాను. అమ్మాయి నువ్వుకూడా ఉండాలి. సాయంత్రం ముగ్గురం కలిసి వెళ్దాం పార్టీకి. "

పార్టీలో అంతటా కలియ తిరుగుతూ అరేంజ్‌మెంట్సు చూస్తూ ఒకతను నలుగురి దృష్టిలో పడ్డాడు. రవికికూడా అతనెవరూ అనిపించింది.

" మావయ్యా అతనెవరూ ? "

" అతనూ " అంటూ అతన్ని పిలిచాడాయన.

" ఇతను ఎస్. వి. రావు. మనకంపెనీ జ న ర ల్ మానేజరు. మీట్ మిస్టర్ రవి మై వుడ్‌బి సన్‌ఇన్‌లా " అంటూ పరిచయం చేశాడు. ఓరగా రవి ఫీలింగ్సు గమనించాడాయన. ఎలాంటి అయిష్టతా లేదా మొహంలో.

రవికి ఉన్నది ఒకటే వేదన. అత్యంత ఆత్మీయుడైన ముసాఫిర్ మరణం తనని ఎంతగా బాధిస్తోందో. అతనికి ఆప్తురాలు, అతన్నే సర్వస్వంగా నమ్మిన పల్లవి దిక్కులేనితనం రవిని బాధపెడ్తోంది.

ఈ విషయం సక్రమంగా అర్థం చేసు కు న్నా డు పెద్దాయన. అప్పుడనిపించిందాయనకి పల్లవికి కూడా తోడు అవసరమని, అది ఒక్క పెళ్ళిద్వారానే సాధ్య పడుతుందనీ.

అందుకే ఓనాడు

" రవీ ! పల్లవికి మళ్ళీ పెళ్ళి చేస్తే బావుంటుంది గదా ! " అంటూ ఆ ప్రసక్తి తెచ్చాడు.

ఆ మాటకే ఉలిక్కి పడ్డాడు రవి. "అమ్మో పల్లవితో ఆ మాట అంటే ! అమ్మో ఎలా మావయ్యా ! "

" కాలమే అవసరాన్ని గుర్తు చేస్తుంది రవీ "

" ఒప్పుకుంటే మంచిదే . అసలా విషయమే ఆవిడ దగ్గర ఎలా తేవటం ? "

" నేను చూస్తాలే "

అంతటితో ఆపేశాడాయన. ఆయనకీ తెలుసు. ఆరు నెలలు కూడా కాకుండా ఆ ప్రసక్తి తెస్తే అంతగా ప్రేమించిన ఆ భర్తను మర్చిపోలేని ఆ అమ్మాయి ఎలా

రియాక్ట్ అవుతుందో. మరో ఏడాది గడిస్తే ఆమే దారిలోకి వస్తుంది. అనుకున్నాడాయన. ఈ లోపు తన బిడ్డ మనసు కష్టపడకుండా పరిస్థితులు చెడకుండా చూసుకోవాలి అనిపించింది.

విజయవాడనించి పల్లవిని ట్రాన్స్‌ఫర్ చేయిస్తే సగం సమస్య తీరుతుందని కూడా తోచింది.

ఏం చేశాడో ఎలా చేశాడో తెలిదుగానీ మొత్తానికి పల్లవికి విజయవాడ నించి ట్రాన్స్‌ఫర్ వచ్చింది. అదీ వనజ ఊర్లోనే వచ్చింది.

ట్రాన్స్‌ఫర్ అయితే ఎలాగబ్బా అని దిగులు పడ్తున్న రవికి ఊరట, పల్లవికి ఆసట, బాసట.

పల్లవికి వనజ తండ్రిగారు తమకు అతి సమీపంలో ఇల్లు చూసి పెట్టారు.

" రవీ ! పల్లవి ఒకటీ, వనజ ఒకటీ కాదు నాకు. అన్నీ నేను చూసుకుంటాను " అంటున్న ఆ పెద్దాయనలో పల్లవికి తండ్రి మరోసారి దర్శనమిచ్చాడు.

రవి ఖాళీ దొరికినపుడల్లా వనజావాళ్ళ ఊరికే వస్తున్నాడు. ముసాఫిర్ తాలూకు డబ్బంతా కలిపి యాభైవేలు వస్తే పదేళ్ళకు ఫిక్సెడ్‌డిపాజిట్ చేయించాడు పెద్దాయన.

సాదాగా గడిచిపోతోంది కాలం.

తరచు ఏదో ఒక పని మీద ఎస్. వి. రావు ఇంటికొస్తుంటాడు. కాయితాల మీద సంతకాలకో, కంపెనీ పనుల విషయం చర్చించడానికో సాధారణంగా 6 గం॥ల తరవాతే వస్తుంటాడు.

ఇంచుమించు 6 దాటాక పెద్దాయన బయటకు వెళ్ళడం మానేశాడు. ఆ సమయంలో సాధారణంగా పల్లవి ఇంట్లోనే కూర్చుంటూ ఉండడం, ఎస్. వి. రావు అక్కడికే రావడం మొదలైంది.

అప్పటి కప్పుడు టైపు చేయవలసిన పేపర్లు పల్లవి టైపు చేసి పెట్టడం అలవాటయింది. చిన్న పోర్టబుల్ టైపుమిషను ముసాఫిర్‌దే పల్లవి దగ్గర ఉండడంతో పల్లవి

## ప్రశ్నలు-సమాధానాలు

1. సైకిల్‌ను ఎవరు, ఎప్పుడు తయారు చేశారు ?
2. ఒక 'కిలో' కి ఎన్ని పౌన్లు ?
3. 1982 ఆసియా క్రీడలలో మొదటిసారిగా చేర్చబడిన ఆట ఏది ?
4. ఇటీవల అణుదుర్ఘటన ఎక్కడ జరిగింది ?
5. భారతదేశపు మొదటి విమాన వాహన నౌక పేరేమి ?
6. ఏసుక్రీస్తు సమాధి ఎక్కడ ఉంది ?
7. క్రికెట్ ఆటలో 'సర్' అను బిరుదు పొందిన మొదటి క్రికెట్ ఆటగాడెవరు? ఏ దేశస్థుడు ?
8. ' టెంపుల్ ఆఫ్ ది ట్రూత్ ' ఎక్కడ ఉంది?
9. ఫ్రెంచి విప్లవం ఎప్పుడు ఆరంభమైనది ?
10. ఆస్ట్రేలియా జాతీయ క్రీడ ఏది ?
11. ' పీపుల్స్ డైలీ ' అనే ప్రఖ్యాత దినపత్రిక ఎక్కడనుంచి వెలువడుతుంది ?
12. లక్షద్వీప రాజధాని ఏది ?
13. ఇండియాలో పార్లమెంటు సభ్యుడు అందుకునే జీతం ఎంత ?
14. కీర్తిస్థంభం నిర్మింపబడిన చోటేది ?

1. ప॥ జర్మనీకి చెందిన బేరన్‌వాన్ డ్రేయిస్ 1817లో 2. 2.2 పౌన్లు 3. ఈక్వెస్ట్రియన్ 4. చెర్నోబిల్ (రష్యాలో) 5. ఐఎన్ఎస్ విక్రాంత్ 6. జెరూసలెంలో 7. డాన్ బ్రాడ్‌మన్, ఆస్ట్రేలియా 8. కాండీ (సిలోన్‌లో) 9. 1789 10. క్రికెట్ 11. చైనా 12. కవరట్టి 13. 1000 రూపాయలు, 14. చిత్తూర్ ఘర్.

ఊరికే కూర్చోడం ఎందుకు బాబాయ్ అంటూ తానే ఆ పని చేసి పెడ్తూంది.

కాలం గడచిపోతూంది.

అవసరమున్నప్పుడు పల్లవి దగ్గరకే సరాసరి రావడం, అవసరమైన డ్రాఫ్టింగ్, పైపు వగైరాలు చూసుకోడం అలవాటయింది.

ఎంతటి గాయానికైనా మహత్తరమైన మందు కాలం. చరిత్రలో ఎన్నో పరాభవాలు, ఎన్నో విజయాలు కాలంతో పాటు కనుమరుగైపోతున్నాయి.

నెమ్మదిగా పల్లవి మామూలు మనిషవుతోంది.

వనజకూ పల్లవికీ తండ్రిమూలంగా దగ్గరితనం ఎక్కువయింది.

" నాన్నా సినిమాకి వెళ్తాను " అన్న కూతుర్ని

" పల్లవిని గూడా తీసుకెళ్ళమ్మా " అంటూ

" నాన్నా షాపింగ్‌కి వెళ్ళాలి " అన్న బిడ్డతో

" పల్లవితో వెళ్ళు తల్లీ ! పాపం ఆ పిల్లని మాత్రం రమ్మనేవాళ్ళెవరూ ! " అంటూ వనజకూ పల్లవికీ మధ్య సాన్నిహిత్యాన్ని పెంచాడాయన. ఇప్పుడు పల్లవీ వనజా మంచి స్నేహితులు.

అప్పుడప్పుడూ రవి వచ్చినా అతనికీ తృప్తిగా ఉంది. పల్లవి ఒంటరిది కాదు అని ధైర్యంగానూ ఉంది.

ఎస్. వి. రావు భార్య చనిపోయి నాలుగేళ్ళు. అతనికి ఇద్దరు పిల్లలు. ఇద్దరూ హాస్టల్లో ఉండి చదువుకుంటున్నారు.

కొన్నాళ్ళు గృహస్థాశ్రమంలో ఉండి కూడా ఇప్పుడు ఒక్కడూ హోటల్లో తింటూ రూంలో పడుకుంటూ కాలక్షేపం చేస్తున్నాడు.

పల్లవికీ విషయం తెలిశాక అతనంటే ప్రత్యేకమైన సానుభూతి. అవకాశం ఉన్నప్పుడల్లా అతన్ని తన ఇంట్లో భోజనానికీ ఉంచేస్తుంది. సాధారణంగా రాత్రిపూట అతని భోజనం పల్లవి ఇంట్లోనే. వద్దు వద్దంటూనే ఉండిపోతాడు.

ఒకరి స్థితికి మరొకరు జాలి పడుతూ, సానుభూతితో ఒకరికొకరు సహకరిస్తూ కష్టసుఖాలు కలబోసుకునే స్థితికి వచ్చారు. పెద్దాయన ఆశించిందీ అదే. కాలం కాళ్ళ జెర్రిలా పాకడం మానేసి నిశ్చలంగా పారే సెలయేరులా ఉంది. ఎవరికివాళ్ళకే స్థిరపడ్డట్లుగా అనిపిస్తోంది.

రవికి రిప్రజంటెటివ్ నుంచి బ్రాంచి మేనేజరు ప్రమోషన్ వచ్చింది. విజయవాడలోనే పోస్టింగు. వనజకు డిగ్రీ అయిపోయింది.

" రవీ ! ఇక వనజ పెళ్ళి చేసేస్తే నాకు బాధ్యత తీరిపోతుందయ్యా - నీక్కూడా నిలకడగా ఒకేచోట ఉండటానికి అవకాశం వచ్చింది ఏమంటావు ? "

" నాకు అభ్యంతరం లేదు మావయ్యా. వనజకి డిగ్రీ కూడా అయిందిగా ! మీ ఇష్టం " అన్నాడు రవి. కాని అతని మనసులో పల్లవి కూడా పెళ్ళి చేసుకుని సెటిల్ అయితేనో అని ఓ మూల ఆలోచన ఉంది.

" మావయ్యా పల్లవికి పెళ్ళి చేస్తే బావుంటుందనిపిస్తోంది. ఎంతకాలమని ఒంటరిగా .... " అంటున్న అల్లుడి మాటలు పెద్దాయన మనసులో, అంతరాంతరాలలో ఉన్న ఆలోచనని తట్టి లేపాయి.

" అదే రవీ ! నాకూ అదే అనిపిస్తోంది. ఎస్. వి. రావు, పల్లవి ఒకరినొకరు బాగా అర్థం చేసుకున్నట్లు అనిపిస్తోంది. వాళ్ళిద్దరికే ఒదిలేస్తే ఈ జన్మకి బయటపడరు. మనమే కదిలించాలి "

" నేనుగా ఆ మాట తెస్తే బావుండదు మావయ్యా. చిన్నవాళ్ళం కదా. మీరే కదిలించి చూడండి "

" అలాగేలే. నేనే కదిలిస్తా. " అలా మామూలుగా అన్నా ఆయన చిత్తంలో దృఢనిశ్చయం చేసుకున్నాడు.

అనుభవజ్ఞుడూ, సహృదయుడూ పెద్దాయన మాటల్లో పల్లవికి అపసవ్యత ఎక్కడా కనిపించలేదు.

స్మృతులు శూలాల్లా పొడుస్తున్నా కాలం గడిచేకొద్దీ అవసరాలూ, భవిష్యత్తులో తన బ్రతుకూ ఆ అమ్మాయికి అద్దంలోలా కనిపిస్తున్నాయి. బాబాయిగారి ఆలోచనలో

తన భావి దర్శనమిస్తోంది. ఓ నెలరోజులు మధనపడీ మధనపడీ చివరకు ఓ నిర్ణయానికి వచ్చింది.

"బాబాయిగారూ ! మొదటిసారి నేనుగా నిర్ణయించుకున్న జీవితం నన్ను దగా చేసింది. అన్నీ పోగొట్టుకుని నిస్సహాయంగా నడిసముద్రంలో దిక్కు తోచక పడి ఉన్న నాకు రవి ఆలంబన ఊపిరి పోసింది. దిక్కుగా ఉండాల్సిన అన్నా వదినెలు గాలికొదిలేస్తే తండ్రి కాని తండ్రి అయి మీరు నన్నాదరించారు. మీ ప్రతి ఆలోచనా, మీ ప్రతి సలహా నా మేలు కోరేదే అయివుంటుందని నాకు తెలుసు బాబాయ్. కానీ.... కానీ.... "

"కానీ ఏమిటి తల్లీ ! నీ సందేహం ఏమిటి ? ఎస్. వి. రావు నిన్ను సరిగ్గా చూడడనా ! నీడబ్బుకు ఆశ పడుతున్నాడని అనుమానమా ...."

"ఛ ! ఛ ! అవేం మాటలు బాబాయ్. ఇన్నాళ్ళ పరిచయంలో ఆమాత్రం తెలుసుకోలేనా ! అసలాయన ఈ మాటకు ఏమంటారో బాబాయ్ ఏ అదనపు అర్హతలున్నాయని నేనాశలు పెంచుకోను ? "

"అదినీకెందుకమ్మా పిచ్చి పిల్లా ! నీకంటే అర్హతలున్న పిల్ల ఎవరుంటారు ? అందం తక్కువా, గుణం తక్కువా ! ఆకాడికొస్తే ఉద్యోగస్తురాలివి. నీఒప్పుదల నాకు తెలిస్తే చాలు తల్లీ. అన్నీ నే చూచుకుంటాను. " అన్నాడాయన.

అన్నట్లుగానే అన్నీ కుదిర్చేశాడు,

రవికీ, వనజకీ - ఎస్. వి. రావుకీ పల్లవికీ ఒకే వేదిక మీద ఒకే పందిరిలో జంటకలిపి, భవిష్యత్తు కడలిని కలతలూ, కన్నీళ్ళూ లేకుండా కాపురమనే పడవల్లో నిశ్చింతగా దాటమని నిర్దేశించింది సమాజం.

రవినీ పల్లవినీ మరోలా అర్థం చేసుకుని వనజ అనుమాన గుండంలో పడి కాలిపోయే అవకాశం ఇవ్వకుండా, పరిస్థితిని అర్థం చేసుకుని నలుగురి జీవితాలనూ సరియైన మార్గాన పెట్టిన పెద్దాయన కార్యదక్షతే, ఈ పరిణామాలకు మూలం.

### మీ కు తె లు సా !

ప్రపంచంలోకెల్లా పొడవైన సొరంగ రైలు మార్గం సింప్లన్. స్విజర్లాండ్ నుంచి ఇటలీ వరకు విస్తరించివున్న దీని పొడవు 12 మైళ్ళపైగా వుంది.

* * *

ఒక సగటు మనిషి జీవితకాలంలో 50 టన్నుల ఆహారము, 11 వేల గాలన్ల ద్రవ పదార్థములు తీసుకుంటాడు. అతను పట్టణంలో జీవిస్తే తన మొత్తం జీవితకాలంలో 7 వేల మైళ్ళు నడుస్తాడు. పల్లెప్రాంతంలో జీవించే వ్యక్తి అయితే దాదాపు 28 వేల మైళ్ళు నడుస్తాడు.

* * *

ఇండియా తీరం పొడవు దాదాపు 6,083 కిలో మీటర్లు. ఇండియా, శ్రీలంకల మధ్య దూరం 35 కిలోమీటర్లే.

అదే - తానూ అనుమానించి రవిని దబాయించడానికి ప్రయత్నిస్తే అతను ఎదురు తిరిగి వనజనైనా తృణీకరించే వాడేమో !

అంతేకాదు- పల్లవి తన నిర్దోషిత్వాన్ని ఋజువు చేసుకోలేక ఏ ఆత్మహత్యో చేసుకుని ఉండేదేమో !

వీటన్నిటినీ ఊహించే- ధన వంతుడైన తను ఏ నిర్ణయం తీసుకున్నా సాధించుకోగల శక్తి ఉండీ తొందరపాటు నిర్ణయాలు తీసుకోకుండా తన బిడ్డ జీవితమూ కాలగతిలో అన్యాయం అయిపోయిన పల్లవి జీవితంకూడా నాశనం కాకుండా సరైన సమయంలో సరైన నిర్ణయం తీసుకున్న పెద్దాయన ఈ కథకి హీరో.

కార్యదక్షతా, విజ్ఞతా, సహృదయతా ఒక్కచోటఉంటే దానికి ఆలోచన తోడయితే బతుకులు చిన్న చిన్న గతుకులకు లోనైనా జీవనయానం మాత్రం నిశ్చితంగా, నిబ్బరంగా సాగుతుంది. ★

(అయిపోయింది)

# వైద్యవాణి

## ఆదొండ

ఇది తీగజాతిలోనిది. దుంపనుండి బయలుదేరి విస్తారముగా ప్రాకును. ప్రాను పెళుసుగానుండి తీగ పూర్తి వరకూ వాడిగల వంకరనైన ముళ్ళుండును. దీని కాయ మారేడుపిండి ఆకారము కలిగి దళసరి పెచ్చుండును. లోపలి గుంజు తెలుపు. గబ్బు వాసన ఉండును. పండు ఎరుపు. గింజలు నలుపు. పువ్వు జాకావలె నుండును. పూలకు రేకులుండవు కాని నీలిరంగు, కొంచెము ఎరుపు రంగు గల పుప్పొడి మాత్రముండును ఆకు గుండ్రముగా 2 అంగుళము లుండును. తీగనిండా నల్లచీమలు ప్రాకు చుండును.

దీని రుచి చేదు. ఉష్ణవీర్యము చేయును. పచ్చికాయల కూర గర్భ వ్రణములను మాన్పును. మిక్కిలి పైత్య కారి. క్రిమిహారి. విషహారి. దీని లేత చిగుళ్ళను మిరియములు నూరి శనగ గింజంత మాత్రలు చేసి సేవించిన అతి మూత్రము తగ్గును; వేరు గంథము అడ్డ గఱ్ఱలపై పట్టువేసిన అవి కరుగును. అతి ఎక్కువసేపు వుంచిన మంట బయలుదేరును. వేరు కడుగుతో అరగ దీసి పొత్తి కడుపునకు పట్టువేసిన మూత్రము జారీయగును. పగులని గడ్డలకు కట్టిన చిదుగును.

యస్. యన్. దుర్గారావు

## నిత్య సత్యాలు

* నవ్వుతూ నవ్వుతూ పనిచేయగలవాడు గొప్ప వాడు. నవ్వుతూ కష్టాల నెదుర్కొన గలవాడు మరింత గొప్పవాడు.
* కొంగ తన ముక్కుతో తన కడుపు మాత్రమే నింపుకొన్నట్లు మనుష్యుడు జీవించరాదు. తన వలన అనేకులు బ్రతుకుచున్న మనిషి జీవనమే జీవనము.
* పుణ్యం చేయుచున్నానను అహంకారమునకు మించిన పాపం మరొకటి లేదు.
* పొంగి క్రుంగని తత్త్వాన్ని అభివృద్ధి పరచు కుంటే, లొంగి వంగని జీవితం గడుపవచ్చు.
* భక్తియే నిజమైన శక్తి, భక్తిలేని శక్తి నిరర్ధ కం. ఆత్మశక్తియే అన్నిటికీ మించిన శక్తి
* దీర్ఘాలోచన లేకుండా చేసే పనులు అనేక అన ర్థాలకు దారి తీస్తాయి. తొందరపాటుతనం వల్ల కాబోయే కార్యం కూడా కాకుండా చెడిపోతుంది.
* నీలో పొరపాటున్నదని ఎవరైనా అంటే, అదేమిటో తెలుసుకోవడానికి ప్రయత్నించాలే తప్ప బుకాయించడానికి ప్రయత్నించకూడదు.
* ఇష్టంకాని పనులను ఇష్టమైనవిగా చేసుకోవడం వివేకవంతుని లక్షణం.
* ధర్మమే మానవునికి రక్ష. అలక్ష్యం చేసినట్ల యితే ధర్మమే మానవుణ్ణి ధ్వంసం చేస్తుంది.
* కోపం ఎంత చిన్నదయినా హృదయాన్ని దహించివేస్తుంది.
* వేదనలో నలిగినప్పుడే, అవమానాగ్నిలో క్రాగి నప్పుడే మానవ హృదయంలోని అసలైన లోతులు వెల్లడి పడుతాయి.

ఆశ్రమవాసపర్వం – 9

# ధృతరాష్ట్రునితో పాండవులు

ఆ మీద ఆంబికేయుడు యుధిష్ఠిరునితో ఇలా అన్నాడు. "ఓ ధర్మరాజా! కుశలివై ఉన్నావా? రాజ్యంలోని పౌరజనులు, జానపదులు నిన్ననుసరిస్తూంటారా? తమ్ములూ, సఖులూ, బందుగులూ సుఖులై ఉన్నారా? జీతగాండ్రందరూ తమ కోర్కెలు తీరుతున్నాయని సంతోషంగా ఉన్నారా? వెనుకటి రాజుల నడవడి ననుసరిస్తున్నావా? నీతితో కోశాగారాన్ని వృద్ధి పొందిస్తున్నావా? పుణ్యమూ, కీర్తి రెండూ కూడా అతిశయించేటట్లు అగ్రహార జనుల మీద ఈగ అయినా వ్రాలకుండా చూస్తున్నావా? మిత్రులైన రాజులపట్ల స్నేహంతోనూ, శత్రువులైన రాజులపట్ల పరుషంగాను వ్యవహరిస్తూ, అందరూ నీ వశంలో ఉండేటట్లు చేసుకుంటున్నావా? కొందరు నృపులు ఉదాసీనంగా ఉంటారు; అట్టివారి నొక కంట కనిపెట్టి చూస్తున్నావా? దేవతలను, పితృదేవతలను, అతిధులను, ఉచితమైన పూజలతో తృప్తి పరుస్తున్నావా? ప్రజలు నిజ ధర్మాన్ని ఆచరిస్తూ ఉంటారా? దేశంలో బాలురూ, దుర్బలురూ, భామినులూ, వృద్ధులూ, మనస్సున కించిత్తు కూడా భయాందోళనలు లేక ఉండేటట్లు, నీ ఆజ్ఞ పురానా, రాజ్యానా చెల్లుతూ ఉంటుందా?"

"ఓ రాజా! నీ భవ్యమైన ఉపదేశంవల్ల అన్నీ సక్రమంగా నిర్వహింప బడుతూనే ఉన్నాయి," అని, ధర్మరాజు ఇంకా ఇలా అన్నాడు. "మీరు వృద్ధులు. ఆయాసానికి ఓర్చుకోలేని మీ శరీరం తపస్సుకు అనుకూలిస్తోందా? కుంతి ఆయాసపడక మీకు యథోచితమైన శుశ్రూష చేస్తోందా? మా పెదతల్లి కష్టాలన్నింటినీ ఓర్చుకుంటూ, తపఃక్రియలన్నీ నిర్వర్తించ గలుగుతోందా? కొడుకుల్ని మ్రింగిన పాపాత్ములం! మమ్మల్ని తలచుకుంటూ మీతో ఏమంటోందో! సంజయుడు తపమునకు ఓర్చుకొని ప్రవర్తిస్తున్నాడా? ఇంతవరకూ విదురుడు కనపడలేదు! ఆతడు మిక్కిలి ధీరచిత్తుడు. అతడెక్కడికి వెళ్ళాడు? ఆతనిని చూడాలి, మహారాజా!"

వ డ లి మం దే శ్వ ర రా వు

ధృతరాష్ట్రుడు: "నేను తపస్సుకు ఓరుస్తాను. కుంతి ఆయాసపడక మాకు శుశ్రూషను చేస్తూంటుంది. మహాశీలవతి గాంధారి తపోనిష్ఠకు ఓర్చుకోగల సమర్థ. ఆ మహానుభావకు మీరు జ్ఞాపకం వచ్చినపుడల్లా, మిమ్మల్ని దీవిస్తూంటుంది. సంజయుడు ప్రాజ్ఞుడు, తపశ్చరణ అతనికి విసువును కల్గించదు. విదురుని మాట అడిగావు కదూ! ఆతడు మమ్మల్ని విడిచి ఎక్కడెక్కడో తిరుగుతూంటాడు. ముని జనానికే ఆశ్చర్యాన్ని కల్గిస్తూ, జలాన్నీ, గాలినీ ఆహారంగా చేసుకుని ఉంటాడు; ఒక్కొక్కప్పుడు అవీ లేకుండా ఉంటాడు. నిర్జనమైన అరణ్యంలో మమకారాలన్నింటినీ కోసివేసుకుని, స్వతంత్రుడై సంచరిస్తూ ఉంటాడు. ఒక్కొక్కప్పుడు అకస్మాత్తుగా కట్టెదుట కనపడుతాడు." అని అంటూండగా ఆ క్షణానే ధర్మరాజునకల్లంత దూరంలో విదురుడు కనబడ్డాడు.

ఆతని శరీరమంతా అడవిలో దుమ్ము కొట్టుకుని పోయింది. జుట్టంతా జడలు గట్టింది; దిగంబరుడై ఉన్నాడు. ఆశ్రమంలో అంతమంది జనముండడాన్ని చూచి, ఆతడు వెనుదిరిగి పోవ నారంభించాడు. ధర్మరాజు తన అనుచరులందరను అక్కడ నిలిచిపొమ్మని, తానొక్కడూ ఆతనిని సత్వరంగా అనుసరించి వెళ్ళాడు. విదురుడు చెట్ల వెనక ఒకసారి కనుమరుగవుతూ, ఒకసారి

కనబడుతూ పోతూండగా, ధర్మరాజు గొంతెత్తి, " ఓ విదుర ! ఓ విదుర ! నిలు ! నిలు ! నేను యుధిష్ఠిరుడను, నిన్ను చూడటానికే వచ్చాను ! " అని పరుగెత్తి ఆతనిని కలిసికోవాలనుకుంటుండగా, ఆ మహాత్ముడు వెనుదిరిగి చూసాడు ; బయలుగా నున్న తావున గల ఒక చెట్టు మొదట నిలబడ్డాడు.

ధర్మతనయుడు సమీపానికి వెళ్ళాడు. ఆ యోగికి కట్టెదురుగా నిలబడ్డాడు. విదురుని నయనాలు అర్ధనిమీలితములై ఉండగా, ఆతడు మాటాడక నిలిచిపోయాడు.

" ఓ నిర్మలాత్మకా ! నేను ధర్మసూనుడను ! నన్ను ఒక్కసారి కనువిచ్చి చూడవే ! " అని ఆతడనగా, విదురుడు కనురెప్పలను తెరచాడు. ఆ పాండవోత్తముని నిశ్చలంగా చూచాడు. "ఉదాత్తయోగ

బలము గైకొని యింద్రియములను బ్రాణ
ములను నింద్రియములఁ బ్రాణములను గలపి
నిజ శరీరంబు విడిచి యా నృపతి తనువు
సొచ్చె దేజోమయత్వ విస్ఫూర్తి మెఱయ. "

యోగ బలంతో విదురుడు నిజ శరీరాన్ని విడిచి, ధర్మరాజు నందు ప్రవేశించగానే, ఆతని శరీరంలో కాంతి, బలమూ, మిక్కిలిగా గోచరించాయి. తన బుద్ధి మరీ విమలమైనట్టు ధర్మరాజునకు తోచి, ఆశ్చర్య పడ్డాడు.

విదురుని శవము వికృతి లేక, నిద్రలో నున్నట్లు వాలి ఉండడాన్ని చూచి, దానికి ధర్మజుడు దహనసంస్కారాన్ని చేయ సంకల్పించగా, అతనికి మింటనుండి పెద్ద గొంతు ఇలా వినబడింది. " ఓ ధర్మరాజా ! విదురుడు 'యతిత్వ గౌరవోజ్జ్వలు'డు. ఈతని కళేబరానికి అగ్నిసంస్కారం అర్హమైనది కాదయ్యా ! "

ధర్మరాజు ఆశ్చర్యపోయి, వెనుదిరిగి ఆశ్రమానికి వెళ్ళాడు. తమ్ములకూ, తండ్రికీ జరిగినదంతా సవివరంగా తెలియ చెప్పగా, అందరూ అద్భుత రసంలో మునిగి పోయారు.

అంతవరకూ ధృతరాష్ట్రునితోనే ఉన్న ముని జనమంతా ఆతని దగ్గర సెలవు తీసుకొని తమ తమ నివాసాలను చేరుకొన్నారు.

తర్వాత ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో, " తమకేది ఆహారమో దానితోనే ఆతిథ్యాన్ని నెరపడం ధర్మమార్గం. అందుచేత ఫల మూలములను మాతో బాటు మీరూ ఉపయోగించాలి ! " అన్నాడు. అందరూ అలాగే ఫల మూలములను ఆరగించారు. నేలమీదనే నిద్రపోయారు. సూర్యోదయం కాగానే, పాండవులు కాలోచిత కృత్యాలను నడిపారు. ధర్మరాజు సోదరులతో, వారి స్త్రీజనంతో, తగు పరివారంతో ఆశ్రమాన్నంతా చుట్టి వచ్చారు. అక్కడి తాపసుల స్నాన, హోమ, జప ధ్యానాదికములైన ధర్మచర్యా విధానాన్నీ, వివిధ మృగాలూ ఆశ్రమంలో నిర్భయంగా సంచరించడాన్నీ, వివిధ పక్షులూ నిశ్శంకగా, నిరాతంకంగా, ఆడుతూ, పాడుతూ, ఎగురుతూండడాన్నీ చూచాడు: తర్వాత ప్రాతఃకాల మందలి అగ్నికార్యాన్ని నిర్వర్తిస్తూన్న ధృతరాష్ట్రుని దగ్గరకు వచ్చాడు. ఆతనికి నమస్కరించి, అభినందన వచనాలతో ఆతని మనస్సును రంజింపచేసి, ఆతని అనుమతితో ధర్మరాజు పవిత్రమైన ఆసనం మీద కూర్చున్నాడు. తమ్ములూ, తానూ, భక్తితో అ మహనీయుణ్ణి కొలుస్తూండగా, శతయూపుడు మొదలైన మునులందరూ వచ్చారు వారందరికీ ధృతరాష్ట్రుడు తగిన దర్భాసనాలను సమకూర్చమన్నాడు. ఆ మునిజనమూ, పాండవులూ, పరమ ధర్మమైన సంభాషణలు చేస్తుండగా మధ్యాహ్నమైంది. అప్పుడు అంబికేయుడు ఆ తాపసులతో " మీరు మధ్యాహ్నిక కృత్యాలను నిర్వహించవలసి ఉంటుందేమో ! " అని వారికి వీడ్కోలు చెప్పాడు. పాండవులకూ అలాగే వీడ్కోలు చెప్పాడు.

పాండవులు ఇలా అంతఃపుర స్త్రీలతో పరివారంతో మొదటి రోజున మిక్కిలి నియమంతో ఆతడిచ్చిన ఫల మూలాలతో ఆకలి తీర్చుకొని, నేలమీదనే నిద్రపోయారు. మరునాడు ధృతరాష్ట్రుడు అనుమతించగా, మనోజ్ఞమైన అన్నపానాదులను అనుభవించారు. మృదువులైన శయ్యలను ఏర్పరచు కొన్నారు. అనుదినమూ పాండవులు అంబికేయుణ్ణి కొలుస్తూ, మునిజనంతో గోష్ఠిని సలుపుతూ ఉండగా, ఆ వృద్ధరాజు వైభవ మెంతటిదో అనిపించేది.

అలా చూస్తూండగానే, నెల్లాళ్ళు గడచి పోయాయి.

ఇలా ఉండగా, ఒకనాడు — (సశేషం) ★

# 'సమాజమా! నీ పయనమెటు!!?'

(కథ) — కుమారి నందివాడ సుబ్బలక్ష్మి

**"పిన్నీ! ఇంకా బయల్దేరలేదా?" అంటూ లోపలికి వచ్చిన నేను ఆశ్చర్యంగా అడిగా.**

"ఆఁ ఏం వస్తాను? ఈ యిల్లు, సంసారం ఒక పట్టాన తెమిలిచావవు కదా! నేను నీలా హాయిగా ఏ బాదరా బందీ లేకుండా ఉద్యోగం చేస్తుంటే వచ్చేదాన్ని" అంటూ ఇంకా ఏదో చెప్పబోతున్న ఆమెవంక చూడకుండా అప్పుడే స్నానం చేసి వస్తున్న విజ్జీని పలకరించా.

"నువ్వయినా వస్తావా?"

"నాకు చాలా వర్కుందక్కా. ఐ కాంట్" అంది గారంగా.

"ఎంతసేపు. ఒక్క గంట. జస్ట్ ఫర్ ఛేంజ్. చదువు మధ్యలో నీ స్నేహితురాలితో బాతాఖాని కొట్టినంత సేపు పట్టదు. ఫర్వాలేదు రా!" అన్నాన్నేను.

"బోర్ బాబు"

"బోరాదుటే. అక్కకి తోడుగా ...." అంటున్న పిన్నితో "నాకు తోడు అక్కర్లేదు పిన్నీ! మనకి అరుదుగా లభించే అవకాశంకదా అని, రామకృష్ణ పరమహంస బోధనల గురించి ఉపన్యాసం కదా అని. నాలుగురోజుల బట్టి నేను ఒక్కద్దాన్ని వెళ్ళటంలేదేంటి! మీరు కూడా వింటారని" అన్నాన్నేను.

"ఆఁ నా బొంద! వాళ్ళు చెప్పేవి నాకు అర్థమవుతాయా పాడా! మీ బాబాయికి అన్నీ వేళకి అందించాలి. ఆయన ఇంట్లోంచి క్షణంపాటు బయటకెళ్ళరు. నాకు క్షణం తీరికుండదు. అయినా ఇలాంటి ఉపన్యాసాలు వయసు మళ్ళినవారికి. నీ వయసులో సినిమాలకి వాటికీ తిరగాలి, అంతేగాని ఈ గోలేంటి?"

"పిన్నీ ..." అంటూ ఏదో చెప్పబోయి 'అనవసరం' అని అనుకొని మానేసి ఆగిపోయాను.

'మన సమాజంలో ఉండే దౌర్భాగ్యం ఇదే. ఉపన్యాసాలు, నాలుగు మంచి మాటలు చెప్పేవాళ్ళని హేళనచేసి అవి అమ్మమ్మ కబుర్లలా భావిస్తారు. జీవితంలో మనం తెలియక చేసే తప్పులు వీటివల్ల సరిదిద్దుకోవచ్చు. కనీసం తనతో ఆత్మీయంగా మాట్లాడే ఈ రెండు వాటాల వాళ్ళనన్నా తీసుకెళ్దామంటే ఇదీ వాళ్ళ వరుసా?' అని నిట్టూరుస్తూ నేను లలితవాళ్ళ వాటావైపు వెళ్ళా.

నన్ను చూసి పేలవంగా నవ్వింది లలిత.

"మీరూ ...." అంటూ సందిగ్ధంగా ఆగిపోయాను.

"మా వారికి అటువంటివి ఇష్టం వుండవు. అందుకని ...."

"ఎటువంటివి?"

"అదే గుళ్ళన్నా, పూజలన్నా, బాబాలు, స్వామీజీలన్నా అసలాయన నమ్మరు?"

"పోనీ మీకు?"

"నాకు అంత ఇంట్రస్టు లేదు. ఏమిటో ఈ హారతుల్లో కొబ్బరికాయల్లో ఏముంది? అయినా నాకు తెలియక

## సమతా దీపం

వేకువలో పెకలించిన
స్వప్న సౌధ స్తంభాలు
కూలిన సౌధం
నలిగిన జనపథం
కూటికోసం
గూటికోసం
గుడ్డకోసం
శూన్యంలోకి ఎత్తిన చేతులు
తిరగబడ్డ జనం
బిగించిన పిడికిలి
వేళ్ళ సందుల్లోంచి
కారుతున్న నెత్తురు
వెలుగు వెల్లువలై పారి
చీకటిని కడిగి
చదునుచేసి మిట్టపల్లాలు
వెలిగించాలి ఎదఎదలో
సమతా దీపం.

— యు. శివలింగం

అడుగుతా నువ్వు పెళ్ళి చేసుకోవా ఏమిటి ? ఇంత చిన్న వయసులో ఏంటి నీకు వేదాంతం పిచ్చి పట్టుకుంది ? " అంది లలిత.

" వేదాంతమా ! మీ ఉద్దేశంలో దాని అర్థమేమిటి ? విజ్ఞానవంతులైన స్వామీజీల ఉపన్యాసాల కెళ్ళటమా ? అక్కడ మీరనుకున్నట్టు మనం తెచ్చే హారతులకి, కొబ్బరికాయలకి ప్రాధాన్యత ఇవ్వరు మనసు ముఖ్యం. మన సంస్కృతి, సాంప్రదాయాల గురించి చెప్పటం మన జాతి గౌరవాన్ని మరింతగా ఇనుమడింప చేయటానికి వాళ్ళు సర్వం త్యజించి స్వామీజీలుగా మారితే అది మనకు నవ్వులాటగా వుంటుందా ? " ఒక్కసారిగా నాలో ఆవేశం అలా వచ్చేసింది.

" ఆఁ. అదికాదు. నేను అలాంటి వాటికెళ్ళటం ఆయన కిష్టం ఉండదు. సారీ ! "

ఇంకా అడిగి ప్రయోజనం లేదని తెల్సుకుని నేను ఒక్కదాన్నీ వెళ్ళిపోయా.

*　　*　　*

ప్రొద్దున లేస్తూనే గమనించా పిన్నీ వాళ్ళింట్లోను లలితా వాళ్ళింట్లోనూ ఒకటే హడావిడిగా ఉంది.

నేను ఆఫీసుకి బయల్దేరుతుంటే విజ్జీవచ్చి " అక్కా నువ్వివ్వాళ సెలవు పెట్టలేదా ? " అంది ఆశ్చర్యంగా.

" ఎందుకు ? "

" అయ్యో ! నీకు తెలియదా ! మన ప్రియతమ నాయకుడు ఈరోజు మన వూరొస్తున్నారుకదా ! మా ఇంట్లోను, లలితా వాళ్ళింట్లోను అందరం వెళ్తున్నాం. నువ్వుకూడా రా ! "

" మరి పిన్నికి తెమిలిందా? "

" ఓ ఎప్పుడో పూర్తిచేసింది. నాన్నగారుకూడా వస్తున్నారు. " ఈలోగా లలిత పెద్దపట్టుచీర కట్టుకొని బయటకి వచ్చింది. పెద్ద పళ్ళెంలో కర్పూరం, కొబ్బరికాయ, పూలు పట్టుకొని. పక్కనే వాళ్ళాయన పైజమా, లాల్చీ వేసుకొని నీట్‌గా వున్నాడు.

గదికి తాళం వేస్తూ ఆశ్చర్యంగా చూస్తున్న నాతో విజ్జీ అంటూంది.

" లలితక్క, ఆ నాయకుడికి హారతిచ్చి కొబ్బరికాయ కొడుతుందట. వాళ్ళాయన దండేసి పాదాభివందనం చేస్తాడట. వచ్చే నాయకుడు అధికార పార్టీకి చెందినాయన. అందులో ముందు ముందు వాళ్ళాయనకి ఆయనతో బాగా పనుందంట " అంది విజ్జీ నాతో.

" ఆహాఁ ! ఆయన మీద ఎంత భక్తి ! " మనసులో అనుకుంటూ రోడ్డుమీద వెళ్తున్న రిక్షా పిల్చి గబుక్కున దాంట్లో కెక్కేసా, " నువ్వూ రా ! అక్కా " అంటున్న విజ్జీ మాటలు వినిపించుకోకుండా. ఆగితే ఇంకా ఏం వినాల్సి వస్తుందోనన్న భయంతో.

"ఓ సమాజమా నువ్వెప్పుడు బాగుపడతావు ! "

# బాపిరాజు వచన కవితా దర్శనం

— డాక్టర్ వి. సిమ్మన్న



తెలుగు సాహిత్య ప్రపంచంలో కాలానుగుణంగా పలు సాహితీ ప్రక్రియలు వెలశాయి. ఒక్కొక్క కాలంలో ఒక్కొక్క ప్రత్యేకమయిన సాహిత్యప్రక్రియ అభివృద్ధి చెందుతూ వస్తుంది. ఆయా ప్రక్రియల్ని బట్టి మనవాళ్లు వాటికాపేరు పెట్టారు. ఆశుకవిత, మధురకవిత, చిత్రకవిత, బంధకవిత, గర్భకవిత, గేయకవిత, వచన కవిత వంటిపేర్లు సాహితీలోకంలో ప్రచారంలో ఉన్నాయి. అందులో వచన కవితాప్రక్రియ బహుళప్రచారం పొంది ఆంధ్ర సాహిత్యంలో స్థిరపడింది.

శిష్ట్లాగారితో ప్రారంభమైన వచనకవితాప్రక్రియ శ్రీశ్రీ, నారాయణబాబు, ముద్దుక్రిష్ణ, పురిపండా, పఠాభి, జరుక్ శాస్త్రి, తిలక్, కుందుర్తి, అజంతా, బైరాగి, కాళోజీ, దాశరథి, ఆరుద్ర, సోమసుందర్, అనిసెట్టి, రమణారెడ్డి, గంగినేని, అరిపిరాల విశ్వం, శీలా వీర్రాజు, బోయి భీమన్నగార్లల్లో చైతన్యవంతమై దినదిన ప్రవర్ధమానమై సంపూర్ణత్వాన్ని సంతరించుకుంది.

ఆధునిక యుగంలో వచనకవిత బహుముఖంగా విస్తృతిని పొందింది. అడివి బాపిరాజుగారు కాలానుగుణ ప్రభావానికి లోనై వచనకవితాప్రక్రియను చేపట్టారు వీరు సాంఘికేతివృత్తాన్ని తీసుకొని సమకాలీన జీవితంపై దృష్టిని సారించి అనేక వచన కవితల్ని వ్రాశారు.

బాపిరాజుగారు రెండు వచన కవితా సంపుటాల్ని వ్రాశారు. ఒకటి 'బాపిరాజు వచనాలు', రెండు 'గడ్డిపూల పళ్ళెము'. ఈ రెండు సంపుటాలు ముద్రణ కాకపోవడం దురదృష్టకరం. ఈ సంపుటాల్లోని కొన్ని వచన కవితలు భారతి, ఉదయిని, మీజాన్ మొదలగు పత్రికల్లో ప్రచురించబడ్డాయి.

'బాపిరాజు వచనాలు' అనే సంపుటిలో పదమూడు ఖండికలున్నాయి. ఇవిగాక "చిన్ననాటి లు, భయంకర భైక్రము" వంటి మరి రెండు పెద్ద ఖండికలు విడివిడిగా వీరి అముద్రిత గేయసంకలనం పుస్తకంలో ఉన్నాయి. ఆయన వచన కవితలు కొన్ని సంపూర్ణంగాను, మరికొన్ని అసంపూర్ణంగాను ఉండిపోయాయి. వీరి కవితల్లో అభ్యుదయ భావాలు బాగా చోటు చేసుకున్నాయి. యానాదుల్ని, కూలీల్ని, హరిజనుల్ని, నిరుద్యోగుల్ని మొదలైన అన్ని రకాల వారి జీవితాల్ని ఇతివృత్తంగా తీసుకుని వచన కవితలు వ్రాశారు. వీరి వచన కవిత్వంలో బడుగు బలహీనవర్గాల జీవితాలు సజీవ చిత్రాలై సాక్షాత్కరించాయి. ఆధునిక యుగధర్మానికి అనుగుణంగా ఆయన వచన కవిత్వం వ్రాశారు.

"యానాది అతిథి" ఖండికలో యానాదుల దైన్యస్థితుల్ని తెలియజేశారు. అన్నంలేక ఆకలి మంటతో ఎంగిలి విస్తర్లకోసం ఎదురుచూసిన యానాదుల్ని బాపిరాజుగారు కాకులతో, కుక్కలతో పోల్చారు.

ఈ కుక్క నా స్నేహితుడు
నా తోటి అతిథి
మేమంతా గొప్ప చుట్టాలం
కాకులూ, కుక్కలూ, యానాదులూ

తినగా మిగిలిన విస్తర్లలోని అన్నం తినడానికి కుక్కలు కాకులు/యానాదులు ఒకరి నొకరు పిలుచు కుంటారని అంటారు. ఎంగిలి విస్తరి కింద పడగానే అన్నానికి మట్టి అంటుకుంటుంది. మట్టి అంటుకున్న అన్నాన్ని తినడానికి వాళ్ళు బాధపడరు సరికదా మీదు మిక్కిలి పిండివంటగా భావిస్తారంటారు. యానాదుల ఆకలి మంటల్ని కళ్ళకు కట్టినట్లు చిత్రీకరించారు.

కిందపడి ఆకుల్లో మట్టి పడుతుంది
కూరలకి నారలకీ
పచ్చళ్ళకీ పప్పులుకీ
అన్నానికీ అన్నిటికీ
మట్టి అంటుకుంటుంది
అయితే ఏం ?
మట్టి ఒక పిండివంటే

క్రింద పారేసిన విస్తర్లను కూడా యానాదుల్ని తీసు కెళ్ళనివ్వరని బాపిరాజుగారు వాపోయారు.

ఈ విస్తరాకుల్లోను విందులు కుడవనివ్వరేం ?
ఈ సేవకులు
మమ్మల్ని కొట్టి తరుముతారేం ?
.... .... ....

శ్రమకోర్చి శాయశక్తులా పనిచేసినా కొంతమందికి కూడు దొరకదు, కాని కొందరు కూలి లేకనే కూర్చుని తింటున్నారని విమర్శిస్తారు.

ఏడాది పనిచేసినా
ఇంత పట్టెడన్నం పడేయని సామి
ఈ ఇస్తళ్ళలో కూడుతిన్న
సాముల కెంత కూలి ?

పేద, ధనికుల మధ్య ఉన్న వ్యత్యాసాన్ని ఈ ఖండికలో చూపించారు. సమాజంలో కుక్కలతో, కాకులతో సమానంగా బ్రతుకుతున్న యానాదుల జీవితాల్ని అద్దంపట్టి చూపించారు.

'కూలి' ఖండికలో కూలీల గొప్పతనాన్ని, వాళ్ళ నిర్మలమైన జీవితాన్ని వివరిస్తారు. కూలివాడు శ్రమకోర్చి ఎంత కష్టపడినా కీర్తికి దాసుడు కాడని అతను అమరుడని బాపిరాజుగారు కూలివాడ్ని కీర్తిస్తారు.

కట్టినావోయి గుళ్ళు గోపురాలూ
ఎత్తినావోయి శిఖరాలు, బురుజులు, మహాభవనాలు
అజంతా ఎల్లోరాలు దొలిచినావోయి
అజ్ఞాత కూలీ
అమరుడవోయి నువ్వు
అమరత్వానికి ఆశపడని
యశానికి వశుడవుకాని
ఆనందరూపీ !

" హరిజనబాలకుడు " ఖండికలో హరిజనులు ఎన్నో యుగాలనుండి సమాజానికి దూరంగా ఉన్నారని వాపోతారు.

ఓయి హరిజనబాలకుడా
నువ్వు ఎన్నియుగాల, ఈ కులంవాళ్ళని, ఈ పొలం వాళ్ళని
దవ్వుగా వుండి దరిచేరకుండా
తపస్సు చేసుకుంటున్నావు

దనవంతుల పొలాల్ని, వాళ్ళ బతుకుల్ని కాపాడడమే హరిజనుల బ్రతుకు అయిందని తన ఆవేదనను వ్యక్తం చేశారు.

అందరికీ సేవ చెయ్యడమే పరమధర్మ మన్నావు
వీర ధర్మమన్నావు
వీరుడవూ ! శూరుడవూ !
వాళ్ళ పొలాలు సేద్యం చేశావు
వాళ్ళ ఊళ్ళు కత్తిగట్టి కాపాడావు
వాళ్ళ పితరులు శయనించే పవిత్ర ప్రదేశం కత్తిగట్టి కాపాడావు

" మహాభిక్షుక సంఘము " ఖండికలో నిరుద్యోగ సమస్యను ఎదుర్కొంటున్న విద్యావంతులు, తక్కువ జీతాలతో జీవితాల్ని అతి కష్టంగా గడుపుతున్న చిన్న ఉద్యోగులు, న్యాయానికి నిలయమైన కోర్టులు, అన్యాయానికి కారకులైన న్యాయవాదులు వీరు అందరూ మహాభిక్షుక

సంఘంలోకి చేరబోతున్నారని బాపిరాజుగారు చాలా బాధ పడతారు. మితిమీరిన పాశ్చాత్యనాగరికతను కూడా తూల నాడుతారు.

" గడ్డిపూల పళ్ళెము " సంపుటిలో ముప్పైరెండు ఖండికలున్నాయి. ఇందులో ఉన్న ఖండికలన్నీ చిన్నవి. పదకొండు పాదాల కంటే ఎక్కువ పాదాలు ఉన్న ఖండికలు లేవు. మూడు, నాలుగు పాదాలు ఉన్న ఖండికలు ఎక్కువగా ఉన్నాయి. రెండు పాదాలు ఉన్న ఖండికలు కూడా ఉన్నాయి. ఖండికలో ప్రారంభ పదాన్నో లేదా మొదటి పాదాన్నో శీర్షికగా పెట్టారు. రచయిత ఈ సంపుటిలో అనేక విషయాల్ని వివరిస్తారు.

"ఎన్ని ఇజమ్‌లు" ఖండికలో "ఇజమ్స్" ఎక్కువైపోయి అవొక పెర్రిగా తయారైందని విమర్శిస్తారు.

ఎన్ని ఇజమ్‌లూ
ఎన్ని వెఱ్ఱిలూ
వెఱ్ఱి వాడంటాడు
తనకే వెఱ్ఱిలేదని

సన్యాసులు ధనం సంపాదిస్తే సంసారులు కాటికాపరులుగా బ్రతకవలసి వస్తుందని దొంగసన్యాసుల్ని దుయ్యబడతారు " సన్యాసులే " అనే ఖండికలో.

సన్యాసులే భగవత్ప్రీతిగా భగవంతుడికోసం
ధనరాసులు సంపాదిస్తే
సంసారులు కాటికాపరులవ్వాలా

" ఏ సంస్థకన్నా " అనే ఖండికలో బిచ్చమెత్తుకొని సంస్థలు పోషించడాన్ని వీరు వ్యతిరేకించారు. అంతే కాక అలా చేస్తే ఆ సంస్థల ఉత్కృష్టత తగ్గుతుందంటారు.

ఏ సంస్థకన్నా బిచ్చం ఎందుకు ?
బిచ్చం ఎత్తడం దాని పవిత్రతను తగ్గించదా ?

పదిమందిలో భగవంతుని ప్రార్థించడమంటే కొంత మందికి సిగ్గు. కాని తనను తాను పొగడుకొని గొప్పలు చెప్పుకోవడమంటే సిగ్గు లజ్జా లేదని విమర్శిస్తారు " పది మందిలో నిన్ను " అనే ఖండికలో.

> **మన సంస్కృతి**
>
> నేటి ఆఫ్ఘనిస్థాన్ ఒకనాటి మన ఉపగణస్థానము. మహాభారతంలో శల్యుని స్థానము అదే. నేటికాబూల్ (కాందహార్) ఒకనాటి గాంధారదేశము. అక్కడ కౌరవుల తల్లి గాంధారి జన్మించింది. నేటి బర్మా ఒకనాటి బ్రహ్మదేశం. నేటి అస్సాము, ప్రాగ్జ్యోతిష పురమనే పేరున మన భారతంలో కనపడుతుంది. సింగపూర్‌ను పూర్వం శృంగపురం అనేవారు. ఈ విధంగా మన ఉజ్జ్వల భారతీయ సంస్కృతి దిశ దిశలా వ్యాపించి భారతీయ నాగరికతను చాటింది.

పదిమందిలో నిన్ను ప్రార్థించడం అంటే
అంత సిగ్గేమిటి నాకు ప్రభూ
పని కల్పించుకొని నన్ను గురించి నేనే
పొగడుకోవడం అంటే సిగ్గు లజ్జా లేదునాకు ప్రభూ

అలలులేని సముద్రం ఎలా ఉండదో అలాగనే కలలు లేని జీవితం ఉండదంటారు "అలలు లేని మహాసముద్రం" ఖండికలో

అలలు లేని మహాసముద్రం లేదు
కలలులేని బ్రతుకూ లేదు

"బాధలు పెట్టడం" ఖండికలో జీవితం ఎప్పుడూ బాధలతో, గాథలతో, వ్యథలతో, సొదలతో ఉంటుందంటారు.

బాధలు పెట్టడం భగవంతునికి సరదా
గాథలు చెప్పుకోడం మనుష్యులకి సరదా
బాధలు గాథలూ బ్రతుకు నిండితే
వ్యథలూ సొదలూ విశ్వంలో ఉండేవి అవి

ఈ విధంగా బాపిరాజుగారి మనోజ్ఞమైన వచనకవితా వైభవాన్ని మనం దర్శించవచ్చు. వీరు నవల, కథ, వ్యాసం మున్నగు ప్రక్రియలతోపాటు వచనకవితా ప్రక్రియను కూడా చేపట్టి అందులో తన కౌశలాన్ని ప్రదర్శించి ఆధునికాంధ్ర వచనకవిత్వాన్ని సుసంపన్నం చేశారు. ★

# జాతీయ విహంగం నెమలి




భారతదేశపు జాతీయ విహంగంగా గుర్తింపు పొందే అర్హత నెమలికి తప్పించి మరే ఇతర పక్షికి లేదు. చదువుల తల్లి సరస్వతి వాహనం నెమలి. నల్లనయ్య కిరీటంపై ధరించింది నెమలి పింఛాన్ని. దేవాలయాలలో విగ్రహాలకు విసిరే వింజామరలు నెమలి ఈకలతో చేసినవే. దైవత్వం కలిగిన పక్షిగా పూజలందుకున్నది నెమలి. ఆ విధంగా భారతీయ సంస్కృతితో ముడిపడివున్న నెమలి భారత ఉపఖండంలో తప్పించి మరెక్కడ కనిపించదు.

మూడు, నాలుగు అడుగుల ఎత్తున దృఢమైన ముక్కు, బలమైన కాళ్ళు, పదునైన వేళ్ళు కలిగివుండే నెమలి ప్రధానంగా అడవులకు పరిమితమైన పక్షి. కాని ఇప్పుడిప్పుడే అది పెంపుడు పక్షిగా మారుతున్నది. నీలపు రంగుతో మెరిసే మెడ, ఛాతి భాగాలు, మరే ఇతర పక్షికి లేనటువంటి పురి కలిగి వుండటం నెమలి ప్రత్యేకతలు. పురి విప్పి నెమలి చేసే నృత్యాన్ని అనేకమంది కవులు వర్ణించారు. నెమలి ఈకలను ఈ నాటికి పవిత్రంగా ఇంటిలో దాచుకోవడం ఆచారం. సంగీత వాయిద్యాలను శుభ్రపరుచుకోడానికి నెమలి ఈకలను వాడుతుంటారు.

తీక్షణమైన కంటి చూపు గలది నెమలి. ప్రమాదాన్ని సులభంగా గుర్తించడమే కాక తన అరుపుతో ఇతర జీవులకు హెచ్చరిక చేస్తుంది. ఎంతో అవసరమైతే తప్పించి నెమలి ఎగరదు. వేగంగా పరిగెడుతుంది. ఆత్మరక్షణకై మానవుడిని కూడా ఎదుర్కొని గాయ పరచిన సంఘటనలు లేకపోలేదు.

గింజలు, విత్తనాలు, పురుగులు, పాములు వీటి ఆహారం. నెమలి పామును కాటేసే విధానాన్ని చూసి తీరవలసిందే.

పురి మగపక్షికి మాత్రమే వుంటుంది. తొలకరివానలు ఆరంభమయ్యే సమయంలో మగపక్షి పురివిప్పి 'నృత్యం' చేస్తుంది. పురి అందానికి ఆకర్షింపబడ్డ ఆడ పక్షులు మగపక్షి 'నృత్యాన్ని' అనుకరించేందుకు ప్రయత్నం చేస్తాయి. మగపక్షులు ఒకటికన్నా ఎక్కువ ఆడపక్షులతో సంసారం సాగిస్తాయి సంతానాన్ని పెంచడంలో కాని, రక్షించడంలోగాని మగపక్షి ఎటువంటి బాధ్యత తీసుకోదు.

గుబురు పొదలలోగాని, ఎండు ఆకులమధ్య గాని ఆడపక్షి నాలుగు నుండి ఎనిమిది గుడ్లు పెడుతుంది. గుడ్లు పొదిగేందుకు సుమారు నెలరోజులు పడుతుంది. పిల్ల నెమలులు అతి చిన్న వయసులోనే ఎగరడం నేర్చుకుంటాయి.

అప్పుడప్పుడు నెమలులు యుద్ధం చేయడం గమనించవచ్చు. ఒక గిరి గీసుకుని, నిబంధనలకు లోబడి యుద్ధం చేసే వస్తాదుల పోటీని గుర్తుకు తెస్తుంది ఈ యుద్ధం. ఏదో ఒక పక్షి ఓటమి అంగీకరించేవరకు యుద్ధం కొనసాగుతుంది. చీకటి పడగానే యుద్ధాన్ని ఆపి తిరిగి ఉదయాన్నే ఆరంభిస్తాయి. చివరికి ఓడినపక్షి మెడ వంచి అడవిలోకి పరుగుతీస్తుంది.

— డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు

# రంజనిమాల

సంకలనం
డా॥ వి. ఫణీంద్రుడు

జయదేవుని అష్టపదులు తెలియని సంగీత, సాహిత్య ప్రియులు చాలా అరుదు. ఈ రంజనిమాల జయదేవుని అష్టపదులలోని పదాలు, వాక్యాలతో తయారు చేయబడింది. అంత చక్కని అష్టపదులను వ్రాసిన జయదేవునికి, వాటిలోని మాధుర్యాన్ని అందజేసిన శ్రీ రాజేశ్వరరావు, శ్రీ ఘంటసాల, శ్రీ బాల మురళీకృష్ణ, శ్రీమతి భానుమతి, శ్రీమతి సుశీలగార్లకి ఎంతో ఋణపడి యున్నాము.

అష్టపదులలోని పదాలు, వాక్యాలు : రతి, హరే, కేశవ, తరళ, మానిని, ముఖర, యమునా, రజని, స్మరతి, కిసలయ, సావిరహే, శిశిరత, రభిసరతి, రతి సుఖసారే, తవవిరహే వనమాలి, వసతి దిశన శిఖరే. ఈ దిగువ ఆధారములతో ఈ పదాలను, వాక్యాలను నింపి రంజనిమాలను పూరించండి.

## ఆధారాలు

అడ్డం

1. " .... సఖీ సీదతీ రాధే ! "
4. " .... గతమభిసారే "
8. " తవ విరహే .... రాధికా కృష్ణా ! "
9. " హరి .. వహతి మధుపవనే "
10. " కురు యదు నందన .... రేణుకరేణ పయోధరే"
12. " పరిసర పరిగత .... జలపూతే "
14. " హరి రభిమాని .... రిదాని మియమపి యాతి విరామం "
15. " జయ జగదీశ ! .... ! "
16. " .... మనోమమ కృత పరిహాసమ్ "







7. " .... సుఖ సమయరసాల సమాదర ముకుళిత నయన సరోజం "

నిలువు

2. " .... శశిని కళఙ్క కలేవ నిమగ్నా ! "
3. " మా కురు .... మానమయే "
5. " .... తవదీనా "
6. " తపతి నసా .... శయనేన "

11) " కరతల తాళ .... వలయావలి కలిత కలస్వన వందే "

13.) " .... మధీరం త్యజ మంజీరం రిపుమివ కేళిషులోలం "

మకరంద్‌కు అసలు వైద్యమే రాదు. వచ్చిన వాళ్ళకందరకూ కబుర్లు చెప్పి పంపుతాడు - ఇది అన్నిటికన్నా పెద్ద ప్రచారం.

శ్యామయ్యంగార్ తన శత్రువును పడగొట్టడానికి వాటినన్నిటిని తగిన మోతాదుల్లో ఆయుధాలుగా ఉపయోగించాడు. భారీఎత్తున ప్రచారాన్ని ఇచ్చాడు. ఫలితం -

మకరంద్ ఇక్కడి నుండి మకాం ఎత్తివేయాలి. లేదా ప్రజలే ణ్ణి బలవంతాన వచ్చిన చోటికి తోలుతారు.




ఈ ప్రచారం చాలామంది విన్నారు—కాని పట్టించుకోలేదు. నిజం చెప్పాలంటే లోకం ఒక విచిత్రమైన చక్రశీలమైన గతిలో సాగుతుంటుంది. దానికి మకరందులూ, రాజులూ ఎవ్వరూ అక్కర్లేదు—ఎవడి బ్రతుకు వాడిది—ఎవడి సమస్య వాడిది—నిరంతర పరిభ్రమణం, గమన వేగాన్ని అధిగమించిన జీవన నైష్ఫల్యం దాని స్వభావ సిద్ధ గుణాలు—నైష్ఫల్యాన్ని అధిగమించిన కర్తృత్వ శక్తి గల విజేత లెందరు ?

దురుద్దేశంతో శ్యామఅయ్యంగార్ ప్రారంభించిన ప్రచారం విచిత్రంగా వంకరలు తిరిగి ఒక్కొక్క అపవాదూ మకరంద్‌కు ఒక్కొక్క కలికితురాయిగా పరిణమించింది—

మకరంద్ మానవ మాత్రుడు కాడు

దేవుడు—

ఆయనలో దివ్యశక్తు లున్నాయి—

చేత్తో స్పృశిస్తేనే రోగాలు నయమౌతాయి—

మందులకు బదులు మంత్రాలవంటి మాటలను ఉపయోగిస్తాడు. రాత్రింబవళ్ళు రోగులతోనే గడుపుతాడు—

రోగుల ఆర్తనాదాలే ఆయనకు సంగీతం—

రోగుల భయంకర దృశ్యాలే ఆయనకు సినిమాలు, నాటకాలు. రోగుల కోసమే పుట్టిన ధన్వంతరి ఆయన—

ఈ వార్తలు ఎవరు వ్యాపింపజేశారు ?

ఎలా వ్యాపించాయి ? ?

రాజు వ్యాపింపజేసిన పుకార్లు ఎలా వక్రభ్రమణం చెందాయి ? ?

ఈ పరిణామాన్ని ఎవరూ పరిశీలించలేదు—

ఒక్క రాణి తప్ప !

ఆమె మకరంద్ గూర్చి నిరంతరం వింటున్నది—

తండ్రీ, శ్యామూ విధీ విరామమూ లేకుండా మకరంద నామస్మరణం చేయడం కంటున్నది.

తాను కూడా వైద్య విద్యార్థిని—

ఒకసారి ఎందుకో మకరంద్‌తో మాట్లాడాలనిపించింది. వెళ్ళింది—

ఉదయం దాటి మధ్యాహ్నం కాబోతున్నది.

విజిటర్స్‌కోసం వున్న కుర్చీలలో కూర్చున్నది.

అవతలినుండి మాటలు వినిపిస్తున్నాయి.

'తల తిరుగుతున్నట్లూ, కళ్ళు చీకట్లు కమ్మినట్లూ వుంటుంది కదా! దాని మాటేమిటి?'

'చూడండి నరసింహంగారూ—నేను చెపితే మీకు విడ్డూరంగా అనిపించవచ్చు కాని అవి కూడా జబ్బులేమీ కావు—కేవలం మీ భ్రమే అట్లా అనిపిస్తున్నది—'

'భ్రమేమిటి? కాసేపు పనిచేసేసరికల్లా టీకి లేవాలనిపిస్తుంది-నలుగురితోనూ కబుర్లు చెప్పాలనిపిస్తుంది-ఒళ్ళంతా నీరసం—పనిమీదికి దృష్టి పోదు.'

'అది మీ శరీర దోషం కాదు. ప్రస్తుత భారతదేశ దుస్థితి అది—ఇప్పుడెవ్వరికీ పనిచెయ్యాలనిపించదు. మీరు చాలా నిజాయితీపరులైనా మీ పక్కసీటువాడు మధ్యాహ్నం పన్నెండు గంటలకు వచ్చి పన్నెండున్నర కాగానే లంచ్ టైమ్ రెస్టుకు లేచి మళ్ళీ మూడు గంటలకు సీటుమీదికి వచ్చి ఓ అర గంటలో చాయ్ అంటూ మళ్ళీ లేచి సాయంత్రం ఐదు ఎప్పుడౌతుందా అని ఎదురుచూస్తూ వున్నాడనుకోండి—అలా మీ సీటుకు ఇటూ అటూ వున్నవారు చేస్తుంటారు. మీకు తెలియకుండానే మీరూ కొంతకాలానికి అలాగే అయిపోతారు. ఎంతో ఉత్సాహంగా భారతదేశాన్ని పునర్నిర్మించాలనీ ఫైళ్ళన్నీ ఒకేరోజు డిస్పోజ్ చేయాలని పట్టుబట్టి పనిలో చేరిన మీకు మంచికే వంచనా అన్నట్లు ఆఫీసరునుండి చీవాట్లు, ఓవర్ టైమ్ పైసలు లేకుండా ఎక్స్‌ట్రా వర్క్ వచ్చిపడేసరికల్లానూ, పనిచేయని దొంగలంటే ఆయన భయపడి మీబోటి నిజాయితీపరులపై అధికారం చెలాయిస్తూ దబాయిస్తుంటేనూ-కొద్ది రోజులలోనే మీకు పన్నెండుకే



(జరిగిన కథ)

డా॥ రాజు మీద శ్యాం మీద పగ తీర్చుకోవటానికి పోచయ్య అవకాశం కోసం చూస్తున్నాడు. డా॥ రాజు తయారు చేసిన ఆయింట్‌మెంట్ తమ మందుని ఇమిటేట్ చేస్తున్నట్టుందని బొంబాయిలోని ఒక మందుల కంపెనీ డా॥ రాజుకి కోర్టు నోటీసు పంపింది. దాంతో రాజుకి బాగా డబ్బులు వదిలాయి. ఇది డా॥ మకరంద్ పనే అని శ్యాం రాజుకి నూరిపోశాడు. డా॥ రాజు హోటల్ 'రాణీ విహార్' మీద పోలీసులు రైడ్ చేసి వేశ్యల్ని పట్టుకుపోవటంతో డా॥ రాజు పేరు బజార్న పడింది. పోచయ్య డా॥ రాజు గురించి చెడుగా ప్రచారం చేయటం చూసిన శ్యాం డా॥ రాజుతో ఇది మకరంద్ పనే అని గట్టిగా నూరిపోస్తాడు. డా॥ రాజు డా॥ మకరంద్ మీద కక్ష కట్టాడు. (ఇక చదవండి)

రావాలనిపిస్తుంది—గట్టిగా ఓ ఫైలు చూస్తే కళ్ళు మంటలెత్తుతై. మూడు కాగానే చాయ్‌కి లేచి నాలుగు వరకు సీటుమీద కూర్చో బుద్ధి పుట్టదు. కేవలం కబుర్లు చెపుతూ కాలక్షేపం చేయాలనిపిస్తుంది. ఇదేదో జబ్బుగా భావిస్తారు మీరు—అలాగనే నేను మందులివ్వడం మొదలు పెడితే ఆ మందులే మీ శరీరంలో ప్రత్యేకమైన రోగాలను ఉత్పత్తి చేస్తాయి. ఈ డ్రగ్ డిసీజ్ అసలు వ్యాధుల కన్నా ప్రమాదకరంగా తయారౌతుంది; అయినా మీరు పొద్దున్న ఎన్నింటికి భోజనం చేస్తారు.

'పది గంటలకు'

'కాఫీ'

'ఎనిమిది గంటలకు'

'మళ్ళీ'

' మళ్ళీ మధ్యాహ్నం పన్నెండు గంటలకు ఒకసారి కాఫీ తెప్పించుకుంటాను—లంచ్ టైంలో కొంచెం టిఫెన్ చేసి మళ్ళీ మరొకసారి తాగుతాను '

' అంటే ఒకటిన్నర ప్రాంతంలో నన్నమాట '

' ఔను— '

' తర్వాత '

' మళ్ళీ మూడు కాగానే చాయ్ అంటూ అంతా సీట్లమీదనుండి లేస్తారు—నేనూ లేస్తాను—'

' మళ్ళీ చాయ్ '

' ఔను—ఆ తర్వాత ఐదు గంటలకు ఇంటికి రాగానే మా ఆవిడ టిఫెనూ కాఫీ ఇస్తుంది—'

' తర్వాత '

' రాత్రి కొద్దిగా భోజనంచేసి పడుకుంటాను—'

' కొద్దిగా అని వేరే చెప్పనక్కరలేదు....అంతకంటే మీరు తినాలన్నా తినడం అసంభవం—అన్నట్లు శలవులు వస్తే స్నేహితుల ఇండ్లకు వెళ్తారు—ఎందరి ఇళ్ళకు పోతే అన్ని కాఫీలు—కదా—!'

' ఔను—'

' నరసింహంగారూ—డబ్బిచ్చి రోగాలను కొనుక్కొంటున్నారు. మళ్ళీ డబ్బిచ్చి ఆ రోగాలకు మందులను కొనుక్కుంటున్నారు డబ్బుకోసం శరీరాన్ని నిర్లక్ష్యంచేసి మరికొందరు రోగాలు తెచ్చుకుంటున్నారు- ఆ రోగాలు నయం కావడానికి మళ్ళీ ఆ డబ్బంతా మందుల షాపుల వాళ్ళకి సమర్పించుకుంటున్నారు—ఈ విష వలయంనుండి మిమ్మల్ని డాక్టర్లు కాపాడగలరనుకోవడం పూర్తిగా భ్రమ. నరసింహంగారూ నేనేదో చెప్పానని అనుకోవద్దు—మీ ఆరోగ్యం మీ చేతుల్లో వుంది. అనవసరంగా ఇందులో వైద్యుల ప్రమేయం కల్పించడం వ్యర్థం—దయచేసి వెళ్ళరండి '

నరసింహం లేచి వెళ్ళిపోయాడు.

క్లినిక్ కట్టేసే టైమయింది.

నరసింగరావు లోపలికి పోయి రాణి వచ్చిన విషయం మకరంద్‌తో చెప్పాడు—చిరునవ్వుతో మకరంద్ వచ్చి రాణికి నమస్కరించాడు—రాణి ప్రతి నమస్కారం చేసింది.

' రండి లోపలికి '

రాణి అనుసరించింది—

లోపల రెండు చిన్న గదులున్నాయి. ఒక గదిలో వంట సాగుతోంది. రెండవది డ్రాయింగ్ కమ్ బెడ్‌రూమ్.

' చాలా సంతోషం—ఇవ్వాళ మా క్లినిక్‌కు వచ్చారు మీరు. '

' నేనూ అలాగే అనుకుంటున్నాను '

' నాన్నగారు ఊళ్ళోనే వున్నారా '

' ఆc—'

' మీ కభ్యంతరం లేకపోతే రండి—కలిసి భోంచేద్దాము '

' లేదు—మరోసారి వస్తాను '

మకరంద్ మాటల్లో ఏదో సమ్మోహన శక్తి వుంది. ఆత్మీయత వుంది—అనురాగం వుంది—

" మీరు ప్రత్యేకంగా ఏదైనా పనిమీద రాలేదు కదా "

" లేదు ఊరికినే ఇలా రావాలనిపించింది వచ్చాను- "

"అలా అయితే రండి—కాసేపు కబుర్లు చెప్పుకుందాము—"

" మీకు భోజనం వేళ అయిందేమో—"

" ఫరవాలేదు—ఉదయం క్లినిక్ టైం అయిపోయిం తర్వాత ఓ రెండు గంటల వరకూ ఇలాగే కూర్చుంటాను- టైం మనం పెట్టుకున్నదే కాని రోగులకూ రోగాలకూ టైమేమిటి? ఎప్పుడైనా రావచ్చు—"

" వస్తే "

" అలా చూస్తూనే వుంటాను—"

" మీ దగ్గరనుంచి చాలా నేర్చుకోవాలి డాక్టర్లు "

" థాంక్స్—మీరేదో కాంప్లిమెంటరీగా అన్నారు కాని మీ నాన్నగారి కన్నా ఎక్కువ ప్రజాసేవ చేయడంలేదు నేను—ఆయన హిమాలయ శృంగమైతే నేనో చిన్న గుట్టను." ( He is a mountain and I am a mole hill—అని ఆంగ్లంలో అన్నాడు ). ఇందులో ఏ కోశానా వ్యంగ్యం పరిహాసం కనిపించలేదు రాణికి.

మకరంద్ చెప్పింది నిజమే - పన్నెండయినా ఇంకా అలా రోగులు వస్తూనే వున్నారు-నరసింగరావు మందులు కలిపి ఇస్తూనే వున్నాడు.

"ప్రస్తుతం జరిపే సింప్టమాటిక్ ట్రీట్‌మెంట్‌మీద మీకు విశ్వాసం లేదట కదా! రోగ నిదానానికన్నా రోగ నివారణకు మీరు ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తున్నట్లు విన్నాను. అలాగే స్పెషలైజేషన్ అంటే మీకు కోపమనీ వాళ్ళు రోగి మొత్తం ఆరోగ్యం పట్టించుకోక అపకారం చేస్తారనీ మీ భావాలట కదా!"

మకరంద్‌నవ్వి "ఎవరన్నారు" అన్నాడు —

"ప్రజలు - వారంతా మిమ్మ ఇలాగే పొగుడుతున్నారు-

మీది గాంధీ వాదమనీ పెన్సిలిన్ స్థానంలో పల్లీలూ మేకపాలూ ప్రతిష్ఠాపించబోతున్నారనీ ప్రజలు అంటున్నారు."

"రాణిగారూ-మీరేమీ అనుకోకండి-ఈ ప్రజల పొగడ్తలూ విమర్శలూ రెండూ అర్థంలేనివి - వాళ్ళు ఎవరిని ఎప్పుడు ఎందుకు పొగుడుతారో వారికే తెలియదు-నేను డెమొక్రాట్‌ను కానని మీరు నన్ను ఎగతాళి చేసినా సరేకాని ఈ ప్రజా ప్రవాహాన్నిబట్టి నేను నా జీవన కార్యాన్ని నిర్ణయించదలచుకోలేదు ప్రజలు నేనారాధించ వలసిన దేవతలు-పరమేశ్వరుడు నన్ను పరీక్షించడానికి పంపే దూతలు. నిజమే కాని వారికి ఆరోగ్యం బాగు చెయ్యడం వరకే మన బాధ్యత-మిగిలినవారి వైయక్తిక సామూహిక, అభిప్రాయాలతో మనం ఏకీభవించనక్కర లేదు -"

"కారణం—"

'కారణం వాటిల్లో నిలకడ వుండదు-స్పష్టత వుండదు-నిరుద్వేగమైన చిత్తవృత్తి వుండదు-సామూహికాభిప్రాయాలను ఎప్పుడూ ఎవడో ఒక మేధావి ఆలోచించి పెడతాడు. రడీమేడ్ చొక్కాల్లా సామాన్యులంతా వాటినే తమ అభిప్రాయాలుగా భావించి వాడుకుంటూ వుంటారు - సమాజంలో ఉద్యమాలు కూడా ఇలాగే పుడతాయి.'

ఈ మాటలు రాణికి ఎంతవరకు పూర్తిగా అర్థమైనాయో చెప్పడం కష్టం! అందుకనేమో సంభాషణ మార్చింది-

'ఇందాక నరసింహం అనే పేషెంటుతో మీరు మాట్లాడుతూ వుండగా వచ్చాను-'

'అరెరె చాలా సేపైందన్నమాట వచ్చి-అలాగే బయట కూర్చొని వుండిపోయారా-'

'లేదు-అప్పుడే వచ్చాను-మీరు మాట్లాడుతూ వుంటే వింటూ వున్నాను-చమత్కారంగా వుంది మీ సంభాషణ-'

'చమత్కారం కాదమ్మా-చూడు-ఈ ప్రజల మనస్తత్వం-జబ్బులు రాగానే డాక్టరు-చీమ కుట్టగానే డాక్టరు-గట్టిగా దగ్గితే డాక్టరు-తలనొప్పి వచ్చినట్లు అనిపిస్తే డాక్టరు-మానసికంగా జాతి చాలా బలహీనమైపోయింది-ప్రభాత సంధ్యలకు నోచుకోని జాతి, పున్నమి చలువలను చూడలేని జాతి, పొగగొట్టాలమధ్య పదంతస్థుల మేడల మధ్య శిధిలమైన జీవచ్ఛవాలను వైద్యుల గుమ్మాల ముందు కాపలా కాయించుకుంటున్నది-'

రాణి నవ్వి 'బాగుంది-మీరిలా కనుక అంటే డాక్టర్లందరి నోట్లోనూ మట్టి పడుతుంది-' అంది-

'ఎందుకని పడుతుంది? రిక్షా తొక్కుకునేవాడు కూడా తానూ బిడ్డలూ సుఖంగా జీవిస్తున్నారే-అలాంటిది ఇంతింత పొడుగు పొడుగు తెల్లకోట్లు ధరించిన ధన్వంతరీ అపరావతారాలు మట్టితిని బ్రతకాలనడంలో న్యాయంలేదు. కాకుంటే ఇప్పట్లా అరంతస్థుల మేడలు కట్టలేకపోవచ్చు-అరవై ఎకరాల మాగాణీ, ముంతమామిడి తోపూ గ్రేప్ గార్డెన్సూ వుండకపోవచ్చు-పోనీ ఏమయింది?? ఒక సంసారం జీవించడానికి నాలుగు గదుల ఇల్లంటే ఎంతో ఎక్కువ లక్షల కుటుంబాలు ఆచ్ఛాదనలేని ఆరు బయట రోడ్డుమీద పడుకునే దేశంలో పైన మరో అంతస్థు కట్టడంకోసం పేదవాడి ప్రాణాలను పణంగాబెట్టి వైద్యమనే జూదం ఆడటం మీరు సమర్థిస్తారా రాణిగారూ....'

(సశేషం)

# పుస్తకసమీక్ష

పుస్తకం పేరు : అలలు

రచయిత : ఎస్. రామారావు, ఎం. ఏ.,

ప్రతులకు : ఎస్. రామారావు
సర్కిల్ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ పోలీస్
మచిలీపట్నం

కవిత్వం రాయడానికి "పాండిత్యం-భాషా పటిమ" అక్కర్లేదనుకుంటాను నేను "స్పందించే హృదయం-భావావేశం-కవితావేశం" వుండి-చెప్పేది సూటిగా-సరళంగా, చెప్పగల్గిన నేర్పు, ఓర్పు, సాధన వుంటే చాలునంటాను. చేసేది "పోలీస్" ఉద్యోగం-విధి నిర్వహణలో క్షణం తీరికుండదు. ఐనా అరకులోయలోని అందచందాలు-"అరుణోదయ దృశ్యాలు తిలకించి"-స్పందించి-సమాజానికి నాలుగు కాలాలపాటు పనికివచ్చే-కవిత లల్లారు. ఆ కవితల్లో ఏదో "ఊపు, లయగతి"-"మానవత"-"కరుణ"-"నవసమాజం కోసరం-పీడిత-తాడిత జనావళి కోసరం-శ్రామిక జనావళి కోసరం పడే తపన-ఆవేదన" మనకు యీ కవితల్లో ద్యోతకమవుతాయ్ అవ్యాజమైన అనుభూతితో రాసిన కవితలవి. అందుకే అలరించాయ్, అన్ని తరగతుల చదువరులను. అదే ఆనందం-రచయిత అంతర్గత సద్గుణాలన్నీ కవితల్లో మనకు స్పష్టంగానే గోచరిస్తాయి. "కొండల్లో కోనల్లో" గల ఆటవిక జనంలో-నిర్మలమైన, నిస్వార్థత గల్గి; మానవత వాదులుగా వుంటారని-ఈ నాగరిక ప్రపంచంలో కారుణ్యం శూన్యమని; తన అక్షర లక్షలను ముందుగానే వివరిస్తారు. రెండవ కవితలో "....పుణ్య పురుషుల ఆదేశాలు, త్యాగధనుల ఆదర్శాలు-విజ్ఞానుల-పరిశోధనలు నాకు శిరోధార్యాలంటూ"-సమాజంలో-అందరికీ అన్నీ అందించడం, ఆనందపరచడం తన ధ్యేయమని "నా ధ్యేయం" కవితలో ప్రకటిస్తారు. ఇక "కవిత"-అనే 9 వ కవితలో-పలికిన పలుకులు మాటల కూర్పు కానేకాదది. "హృదయ పుడల జలది". అందుకే "ఆకలి మంటల-అన్యాయాలకు గురియైన హృదయాలకు ఎట్టి కవిత అవసరం?" అని తన కవితా మానవతా-వాదాన్ని-మచ్చుకు చూపిస్తారు. ఐతే-"ఆనందాలు-ఖేదాల మధ్య-సిరులు-దారిద్రాల మధ్య-వంతెన గట్టి అందర్ని ఒకటి చేసే కవితాయత్నం సాగాలని" పరిష్కార మార్గం కూడా చూపిస్తారు. అందులో ఆశావాదం పరోక్షంగా కనిపిస్తుంది.

అందులోనూ సమతా-మమతా భావంతో మసిలేవాడే సరైన కవి అని సందేశ ధ్వని కూడా స్ఫురిస్తుంది మనకు. పదకొండవ కవిత-"సమ సమాజం" లో పీడిత-తాడిత-జనరక్షణకు-కళ్ళను జ్వలన చేయగ-కుటిల జనుల కూల్చగా-శ్రమజీవుల నుద్ధరింప శాంతి సౌఖ్యముల నందింప"రా-ముందుకు రా"-"ముందుకు నడుం గట్టి ముందుకు" అంటూ-భావావేశంతోబాటు-ప్రజలకు చైతన్య సందేశాన్ని-నేటి సమాజ స్థితి గతులను కళ్ళకు-కట్టినట్లు చూపిస్తారు. అందుకే కాబోలు సమాజ పుటలలో "నవ సమాజ-నిర్మాణ" ధ్యేయంతో "అలలు" లేపారు కాబోలు శ్రీ రామారావుగారు అనిపిస్తుంది. సమాజంలో "ఉన్నవారని-లేనివారని"-"తిన్నవారని-తినని వారని" రెండు-వర్గాలుండరాదనే తపనతో "రెండు వర్గాలు" కవితావేశం, సమాజ స్పందనతో-సంకల్ప బలంతో రాశారనుకుంటాను. అన్నదమ్ములవలే-శాంతియుత సహజీవనం కావాలనే "తపన కోరిక" బలీయంగా కనిపిస్తాయ్. "సాగిపో"—"రెండు వర్గాలు"— అనే రెండు కవితల్లో కూడాను.

"చిన్నరాళ్ళు" అనే కవిత (18 వ కవిత) "కవి కల్పన మనోజ్ఞంగా వుంది. ఆనాటి కళా పోషణా, ఆదరణ, ఆనాటి చరిత్రను, చాటి "పెద్ద శిల్పాలు" పోషణా-ఆదరణ లేక "నిర్జీవ శిల్పాలై" చరిత్రను

కోల్పోయి–శిథిల రూపాలు దాల్చి అవశేషాలయి ప్రభుత్వ ప్రదర్శన శాలల్లో భద్రపరచారనడం వాస్తవానికో వ్యంగ్య సూచిక. కన్నీళ్ళు-ప్వేదంతప్పవని–అయితే అంతమాత్రాన భయపడిపోయి సముద్రాలపాలై పోనక్కర్లేదని–" అన్యాయానికి అడ్డువేద్దాం–న్యాయానికి అడ్డు తొలగిద్దాం / – అందరికోసం ఈ ప్రభుత్వ మందాం /" అంటారు.

అహింసా – శాంతి మార్గాలలో "తెలుగు బిడ్డ" (23 వ కవిత) కవితాక్షరహారమే తెలుగువారికి–. ఇక్కడ ప్రతివాడూ ఒక పులిబిడ్డే" అంటారు సినారె దారిలోనే–.

కవి–కొన్ని కవితల్లో వ్యంగ్యం వున్నా– ఔచిత్యం–భావం–భాష–స్పష్టత" – "తీరు తెన్నులు" సంవిధానం ప్రశంశనీయంగా వున్నాయ్–. స్త్రీ స్వాతంత్ర్యంలో– "మార్పు – చైతన్యం రావాలని – ఆమెకున్న సంకెళ్ళు ఛేదించబడాలని – క్రొత్త యోచనతో – ముందుకు సాగిపోవాలని – వారికి పునరావాసం" (27 వ కవిత) "కావాలని రావాలని" అందుకై "అరుణోదయం" కావాలని – దీనులపట్ల జాలిని చూపిస్తారు.

– కవి భావనలో అభ్యుదయ పథాన నడిచినా : – కొన్ని కవితల్లో – భావ కవితా ఛాయలు – కన్పిస్తాయ్.

"వృత్తి పోలీస్ ఉద్యోగం"–రాసింది "మానవతా – కరుణ – ప్రగతి భావాల" కవితా ప్రవృత్తికి శ్రీ ఎస్. రామారావుగార్ని ; అభినందించకుండా వుండలేం–మంచి కవిత్వాన్నీ పాఠకులకు అందించారు–. క్రొద్దిగా సాధన చేస్తే–వీరి కలంనుండి మరెన్నో "ముత్యాలు–పరిమళాలు–పరివశింపచేసే కవితలు జాలువారాలగలవని"–ఆశిద్దాం–.

– వేమూరి రాధాకృష్ణమూర్తి

# శ్రీరామ కథామృతము – సమగ్ర సమీక్ష

శ్రీరాముడు, శ్రీకృష్ణుడు నాయకులుగా రామాయణ భారతములను, భగవన్మూర్తులైన వాల్మీకి, వ్యాసులు లోకమున కనుగ్రహించిరి. అవి మహా సముద్రములు. వాని పారంగతుడైన వాడెవ్వడు? ఉన్నచో వాడు బ్రహ్మజ్ఞానియే.

ఈ గ్రంథము పేరు శ్రీరామ కథామృతము – సమగ్ర సమీక్ష. అమృతమును త్రాగుదురా ? సమీక్షింతుదురా ? త్రాగినచో వారు దేవతలు. సమీక్షించుట యనగా నేమి ? సమ్యక్ వీక్షణ అనఁగా చక్కఁగా చూచుట. దర్శనము చేయువాడు ద్రష్ట. అనగా ఋషి. ఋష్యాత్మ గల్గిన గాని రామకథా తత్వము అవగాహన కాదు. ఈ సమీక్షకునికి దర్శన సామర్థ్యమున్నదా ? ఉన్నదన్నట్లే యున్నది. ఇందుకు రెండు కారణములు. మొదటిది వశిష్ఠ మహర్షి యపరావతారమైన తాడేపల్లి రాఘవ నారాయణశాస్త్రిగారి అనుగ్రహము. రెండవది "సాహితీ జగద్గురువు"లైన యస్వీ జోగారావుగారి శిష్య వాత్సల్యము. ఇవి రెండును సమీక్షకులైన దక్షిణామూర్తిగారి యందు సమృద్ధిగా నున్నవి.

రామాయణ సంబంధి బహు పూర్వగ్రంథ గత మహా రహస్యములను సమీకరించుట, తత్తన్మహా రహస్యములను తన ప్రతిభ చేత వ్యాఖ్యానించుట యీ సమీక్షకుని యందలి గుర్తింప దగిన విశిష్ట లక్షణములు. తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రి, వారి తనయులు రాఘవ నారాయణ శాస్త్రి కవి ద్వయ కృత శ్రీరామ కథామృతమునకు దక్షిణామూర్తిగారు సమీక్షించుట యనఁగా మరల వాల్మీకమునకు ఒక గోవింద రాజీయము. ఒక మహేశ్వర తీర్థుల వ్యాఖ్య పుట్టినట్లే. "ఆ మహాకావ్య పరమార్థమును ఆత్మ సాక్షాత్కారము పొందిన యోగి వలె దర్శించి అవగాహన చేసి కొని అనుభవించి అనుశీలించిన సమీక్షా దక్షుడు" శ్రీ దక్షిణామూర్తి.

## విప్లవం

"భౌతిక విప్లవం సర్వరోగ నివారిణి కాదు. మానసిక విప్లవం రావాలి. ఒక్కొక్క వ్యక్తినే ఎన్నుకొని సుసంఘటిత జాతీయ జీవనానికి అనువుగా అతణ్ణి మలచడం ద్వారా సమాజం యొక్క మనఃస్థితిలో, ఆలోచనా ధోరణుల్లో, ప్రవర్తనలో ఆమూలాగ్ర పరివర్తన కలిగించే పని అవసరం. దానిని ప్రచార ప్రదర్శనలతో సంబంధంలేని పట్టుదల, ప్రశాంతత, ఏకాగ్రతలతో కూడుకున్న ప్రయత్నమొకటి అవసరం."

— శ్రీ గురూజీ గోళ్వాల్కర్

గాయత్రీ బీజాక్షరములతో నిబంధింపఁబడి రచింపబడిన శ్రీరామ కథామృత కావ్యమున ఇరవైనాలుగు వేల పద్య గద్యములున్నవి. దీనికి మూలము వాల్మీకము. మరియు అధ్యాత్మ రామాయణాది వేదాంతగ్రంథములును. ఈ కావ్య విశేష మెచ్చట నున్నదనఁగా కావ్యత్వమునకు భంగము కలుగకుండ, ఈ కవులు వేదాంత, న్యాయ, ఆధ్యాత్మిక విషయములను ప్రవేశపెట్టిరి. ఆ యీ విషయములను విశ్లేషించి చెప్పుటయందు దక్షిణామూర్తి ప్రతిభ మెచ్చదగినది. ఒక కవికి సద్విమర్శకుని వలన ఎంత మేలు కలుగగలదో - యీ సమీక్షకుడు నిరూపించినాడు.

శ్రీరామ కథామృతము - సమగ్ర సమీక్షయను గ్రంథము రెండు భాగములు. ఆంధ్ర విశ్వవిద్యాలయము వారిచేత పిహెచ్. డి. పట్టమునకై సమర్పితము. కవుల జీవితమను ప్రకరణములో సమీక్షకులు, పితాపిత్రులైన వేంకటప్పయ్యశాస్త్రి, రాఘవ నారాయణశాస్త్రిగార్ల జన్మ విశేషములు వివరించిరి. ఆ తండ్రి, కొడుకులు ఋషులు. రామాయణమంతటి పవిత్రమైన వారు. "రెండు భాషలలో గండ్రండ్రు." సర్వరామకథా సారమును అమృత ప్రాయముగా గూర్పగల్గినవారు వీరు. రామకథామృత కావ్యమును ఆనందము కొరకై వ్రాసిరి. ఈ ఆనంద స్వరూపమును అభినవగుప్త శ్రీమచ్ఛంకరులను అర్థము చేసికొన్న వారికే తెలియును. వైదికములైన యజ్ఞ మంత్రశాస్త్ర, యోగశాస్త్ర విశేషములను శ్రీ దక్షిణామూర్తిగారు చక్కగా తెలిసికొని, రామకథామృతకారుల ఋష్యాత్మ ననుసరించి వ్యాఖ్యానము చేసిరి. "శ్రీమద్రామాయణానువాద విధానము" అను ప్రకరణమున అనువాదమును గూర్చి వీరొక ప్రణాళిక యిచ్చిరి. ఈ నాటి విమర్శకులిట్లే చేయుచున్నారు. మొత్తముమీద వాల్మీకము ననుసరించుట మరియు అధ్యాత్మ రామాయణ విషయములు కూడ చెప్పుట జరిగినది. ఈ జరుగుటలో రస పోషణకు భంగము వాటిల్లలేదు. వర్ణనలు వర్ణనలుగావు. వాల్మీకియే తెలుగులో మరల రామాయణమును వ్రాయుచున్నాడా అన్నట్లున్నవి. కథాకథనము ఋషుల సొత్తు. శ్రీరామకథామృత కథాకథనము ధ్వని మార్గలక్షణ లక్షితము. ఆ కథాకథన స్వరూపమును వివరించుటలో సమీక్షకుల చాతుర్యము ప్రశంసనీయము. ఆదిభట్ల నారాయణశాస్త్రిగారు రాయడుశాస్త్రిగారు అందరిని ప్రశంసించుదురా? వారీ రామకథామృతమును మెచ్చుకొన్నారు. కంచి కామకోటి పీఠాధిపతులు చంద్రశేఖర సరస్వతి స్వాములు - పరమహంస పూజనీయము అగునని యీ గ్రంథమును, గ్రంథకర్తలను ఆశీర్వదించిరి ఇంతకంటే ఏమి కావలయును?

శ్రీ దక్షిణామూర్తిగారికి శ్రీరామకథామృతముపై పరిశోధన చేయ వలెనన్న సంకల్పము కలుగుట, దానిని సాహితీ జగద్గురువులు శ్రీ యస్వీ ప్రాణవంతము చేయుట- యీ గ్రంథమీకీర్తిగా వెలువడుట భగవంతుఁడొక పతకము వేసియుండును.

శ్రీ రామకథామృతము – సమగ్ర సమీక్ష
ఆంధ్రవిశ్వవిద్యాలయంవారి పిహెచ్.డి. పట్టము పొందినది
రచయిత :- డా॥ తూములూరి దక్షిణామూర్తిశాస్త్రి
ఎం. ఏ., పిహెచ్. డి.
వెల : చెప్పబడలేదు   పుటలు 400
ప్రాప్తి స్థానము : శివశ్రీ ప్రచురణలు, కోర్టువీధి
పొన్నూరు 522 124

— కాజ లక్ష్మీనరసింహారావు




" యో న హృష్యతి న ద్వేష్టి
న శోచతి న కాఙ్క్షతి
శుభాశుభ పరిత్యాగీ
భక్తిమాన్ యస్సమే ప్రియః "

అనగా " ఎవడు ఉప్పొంగడో, ద్వేషించడో, దుఃఖించడో, కోరడో, ఎవడు శుభాశుభములను వదలునో అట్టి భక్తుడు నాకు ప్రియుడు, ఇష్టమైన వాడు " అని శ్రీకృష్ణపరమాత్మ అర్జునునికి బోధించాడు.

ఈ శ్లోకములో ఎటువంటి భక్తుడు పరమాత్మకు ఇష్టుడౌతాడో శ్రీకృష్ణపరమాత్మ తేల్చి చెప్పాడు. ఆ అర్హతలు ఉన్నాయో లేవో చూచుకోవలసిన బాధ్యత భక్తులమీద ఉన్నది. ఒకవేళ ఆ అర్హతలు భక్తులవద్ద లేనియెడల భక్తి శ్రద్ధలతో సాధించుకొని పరమాత్మ అనుగ్రహమును సంపాదించడానికి పట్టుదలతో కృషి చేయాలి. " కృషితో నాస్తి దుర్భిక్షం " అన్నారు పెద్దలు. కృషి చేయుటవలన కరువు రాదు. అంటే కృషి చేసేవారు కష్టాలను సునాయాసంగా ఎదుర్కొని సుఖపడతారు. అదే విధంగా భక్తి మార్గంలో కృషి చేసేవారు పరమాత్మకు చేరువై మోక్షమును పొందగలుగుతారు. ఒక విద్యార్థి మామూలు భౌతిక పరీక్షలలో ఉత్తీర్ణుడవ్వాలంటే ఎంతో కృషిచేయాలి. అటువంటప్పుడు సకల చరాచర కోటికి ప్రాణప్రదాతయైన పరమాత్మ సన్నిధికి చేరుకోవాలంటే సామాన్యమా ? పరమాత్మ పెట్టిన షరతులను పూర్తి చేయకుండా (Fullfil) పరమాత్మ అనుగ్రహం పొందాలనుకోవడం ఏ మాత్రం విజ్ఞతకాదు. పదిరూపాయలు ఖరీదు గల వస్తువుకు రు. 9-50 యిచ్చినా అంగడివాడు ఆ వస్తువును మనకు యివ్వడుగదా ! అదే విధంగా పరమాత్మ పెట్టిన షరతులలో ఏ ఒక్కదానిని పూర్తి చేయకపోయినా పరమాత్మ అనుగ్రహమును పొందలేముగదా ! కనుక పరమాత్మ అనుగ్రహమును సంపాదించుటకు ఈ క్రింది షరతులను భక్తులు నెరవేర్చడం అత్యవసరం.

" నహృష్యతి " అంటే ఉప్పొంగడో అనగా ఎవడు మంచి చేకూరినప్పుడు, లాభాలు వచ్చినప్పుడు ఉప్పొంగిపోడో, ఇష్టం వచ్చినట్లు చరించడో, ఒడలు మైమరచి ప్రవర్తించడో అట్టివాడు నాకు ఇష్టుడు అని పరమాత్మ చెప్పారు. అయితే మంచి చేకూరినప్పుడు సంతోషించవద్దనికాదు. తద్విరుద్ధులు పరమాత్మ అనుగ్రహమును నోచుకోలేరు. అయితే మంచి చేకూరినప్పుడు సంతోషించ వద్దనికాదు. సంతోషమునకు, ఉప్పొంగుటకు చాలా తేడా ఉన్నది. ఆ తేడాను భక్తులు గ్రహించాలి. నిండుకుండ తొణకదు గదా ! ఆ విధంగా భక్తులు భావించాలి.

అదే విధముగా కష్టములు వచ్చినప్పుడు దుఃఖించడం గాని, ఇతరులను ద్వేషించడంగాని పనికిరాదు. కష్టసుఖాలు కావడికుండలుగా ఎవరు భావిస్తారో అట్టివారే స్థితప్రజ్ఞులు. కోరికలు బహు చెడ్డవి. అందులో చెడ్డ కోరికలు మహా చెడ్డవి. మంచి కోరికలు ఉండవచ్చును గాని పేరాశ మాత్రం పనికిరాదు. " దురాశ దుఃఖమునకు చేటు " అన్నారు పెద్దలు. కోరడం మన వంతు కాదు. పనిచేయటం మాత్రమే మన వంతు. మన కర్తవ్యాన్ని మనం నిర్వర్తించాలి. బాధ్యతలను మాత్రం విస్మరించ రాదు. ప్రతిఫలాన్ని ఆశించకుండా, స్వలాభాపేక్ష లేకుండా మనవంతు కర్తవ్యాన్ని మనం నిర్వర్తించాలి. ఫలితం యిచ్చే బాధ్యత పరమాత్మదే. మనం ఏ మాత్రం కోరనవసరం లేదు. కోరలేదని అన్యాయం చేయడు. అర్హులైనవారికి అర్హతకు దగ్గట్టుగా ప్రతిఫలాన్ని పరమాత్మ తప్పనిసరిగా అందించుతాడు. మొట్టమొదట ఈ విశ్వాసం మనయందు ఉండాలి.

" అంటే కొంత సంశయం ఉదయించడం సహజం. అశుభాలను వదలి వేయాలి గాని, శుభములను కూడా వదలివేయవలసిన అవసరం ఏమిటి ? అని కొందరు అడుగుతారు. గీతా వాక్యములను బహు జాగ్రత్తగా పరిశీలించాలి. పూర్వాపరాలను సమన్వయించుకోవాలి. ఇచట భక్తియొక్క పరాకాష్ఠ స్థితి వర్ణించబడింది. భక్తియొక్క చరమస్థితి, జ్ఞానస్థితి రెండూ ఒకటే. అట్టి స్థితియందున్న వానికి శుభానికి, అశుభానికి మధ్య తేడా ఏమీ కనిపించదు. రెండూ ఒకటిగానే భావిస్తాడు. సమానంగానే స్వీకరిస్తాడు. అది సర్వోత్తమ స్థితి. ఆ స్థితిని చేరుకోవడం అంత తేలికకాదు. ఆ స్థితిని చేరుకొనిన వానికి శుభము, అశుభము ; సుఖము, కష్టము . సంతోషం, దుఃఖం .... అన్నీ సమంగానే కనిపించుతాయి; అయితే సాధకుడనేవాడు మొట్టమొదట అశుభకార్యములను, దుష్ట సంకల్పములను పరిత్యజించాలి. శుభకార్యములను చేపట్టాలి. పుణ్యకార్యములను చేయాలి. సత్సంకల్పములను కలిగి యుండాలి. " సత్సంకల్పములే మానవునికి ప్రధానమైన ఆస్థి " అని శ్రీ సత్యసాయిబాబా గారు చెప్పారు. ఎప్పుడైతే సత్సంకల్పములకు మన మనస్సు నిలయమవుతుందో, దుష్ట సంకల్పములు వాటంతట అవే దూరమవుతాయి. మనస్సు నిర్మలమవుతుంది. దేవునియందు మనస్సు లగ్నమవుతుంది. ఆ స్థితిలో ఆతనికి అంతా మంచిగానే కనిపిస్తుంది. మంచినే స్వీకరిస్తాడు, మంచినే చేస్తాడు, మంచినే ఆరాధిస్తాడు. అటువంటి స్థితిని చేరుకొనడానికి భగవదానుగ్రహం తప్పకుండా లభిస్తుంది. పరమోత్కృష్టమైన ఆ స్థితిని చేరుకోడానికి భక్తులు ప్రయత్నించాలి.



# ధర్మం ?

" చత్వారో విత్త దాయదాః
ధర్మ భూపాగ్ని తస్కరాః
జ్యేష్ఠ భ్రాతవమానేవత్రయః
కుప్యన్తి సోదరాః "

డబ్బుకు నలుగురు వారసులు కలరు. 1. ధర్మము. 2. రాజు. 3. అగ్ని. 4. దొంగ. ఇందులో పెద్ద వారసుడు ధర్మము. పెద్ద వారసుని పెద్ద వాటా రావలెను. అనగా ధర్మమునకు ఎక్కువ డబ్బు వినియోగించవలెనని భావం. ధర్మమునకు కేటాయించవలసిన సొమ్మును కేటాయించనియెడల మిగతా ముగ్గురు సోదరులైన రాజు, అగ్ని, దొంగలు కోపోద్రిక్తులగుదురు. పన్నుల రూపంలో రాజు కొంత ధనమును స్వాధీనం చేసుకొనును. అగ్ని ప్రమాదములు సంభవించి ఆస్థి నష్టమగును. దొంగలుపడి ఆస్థిని దోచుకుందురు. కనుక ప్రతి వ్యక్తి తన సంపదలో కొంత భాగమును దాన ధర్మములకు విధిగా వినియోగించవలెను. దాన ధర్మములకు వినియోగించు ద్రవ్యము ఇహమునందును, పరమునందును కూడా తిరగివచ్చును. స్నేహితులకు వినియోగించు ద్రవ్యము ఇహమునందు మాత్రమే తిరిగివచ్చును. భోగముల కొరకు దుర్వినియోగము చేయు ద్రవ్యము ఇహమునందుగాని, పరమునందుగాని తిరిగిరాదు.

# శూద్రకుని మృచ్ఛకటికము

సంస్కృత నాటకాలలో శూద్రక మహారాజు రచించిన మృచ్ఛకటికము తక్కిన నాటకములతో పోల్చినపుడు ఒకానొక ప్రత్యేకమైన విలక్షణ సంవిధానకము.

భాస, కాళిదాసాదుల నాటకాలు ప్రాయికముగా పురాణ గాథలు. భాసుడు కొన్ని ఐతిహాసిక ఇతివృత్తాలు తీసుకున్నా మొత్తంమీద పౌరాణిక కథా వస్తువులే పూర్వ నాటక కర్తలలో ప్రధాన స్థానం ఆక్రమించాయి.

1910 సంవత్సరంలో త్రివేంద్రంలోని తాళపత్ర గ్రంథాలయంలో మహా మహోపాధ్యాయ టి. గణపతిశాస్త్రి గారికి భాస నాటక చక్రం లభించింది. ఇందులో 12 నాటకములున్నాయి. వాటిలో మృచ్ఛకటికము కర్త గురించి వేరు వేరు సిద్ధాంతములు బైలుదేరాయి. భాస నాటక చక్రంలో చారుదత్తమనే నాటకం కథ యిది. భాస నాటక చక్రమును గణపతిశాస్త్రిగారు అచ్చు వేయించి, వెలుగులోనికి తీసుకు వచ్చారు.

"భాస, సౌమిల్ల కాదయశ" అంటూ గొప్పగా పొగడిన కాళిదాసు శూద్రకుని పేరెత్తలేదు. అంటే ఆ కవి కాళిదాసునకు పూర్వముననగాని, ఆయన కాలముననగాని మృచ్ఛకటికము వ్రాయబడలేదనే అనుకోవాలి.

కాని, కాళిదాస మహాకవి తరువాత జీవించిన ఒక కవి తన నాటకమునకు మృచ్ఛకటికమను నామకరణముతో విక్రమార్కునికి పూర్వమే వ్రాసినట్లు కొందరు విజ్ఞు లభిప్రాయపడుచున్నారు. ఆ నాటకమును వ్రాసినవాడు శూద్రకుడనే మహారాజుగా తెలియవస్తోంది. ఇతడు ప్రాకృత భాష యెక్కువగా వాడాడు.

భాసుని పద్ధతి ననుకరించి చిన్న చిన్న సంభాషణలు, సులభశైలి వాడారు శూద్రక మహారాజు.

శూద్రకుడు ఊహాకల్పితవ్యక్తి అనీ, ఆ పేరే క్షత్రియులకుండదనీ బెరిడేల్‌కీత్ అభిప్రాయం. కాని, స్టెన్‌కొనో అభిప్రాయాన్నిబట్టి శూద్రకుడు అభీరరాజైన శివభక్తుడు. ఇతని కుమారుడు ఈశ్వర సేనుడు. ఇతడు ఆంధ్ర రాజులలో కడపటివానిని 248 A. D. లో చంపినట్లు తెలుస్తోంది.

ఇటీవల మానవల్లి రామకృష్ణ కవిగారు శూద్రకుని 'పద్మ ప్రాభృతకమ'ను భాణమును వెలువరించిన తరువాత శూద్రకుడను నాటక కర్త వున్నాడని నిర్ధారింపబడినది. ( ఇటీవల దీనిని శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు రేడియో ప్రసారం చేశారు )

---

వేదుల మీనాక్షీదేవి

---

ఉజ్జయిని రాజగు పాలకుడు ఆర్యకుడనే గోపాలుని చేత ఓడింపబడినట్లుగా మృచ్ఛకటిక నాటకములో వుంది. ఈ విషయము భాసుడు ప్రతిజ్ఞా యౌగంధరాయణంలో చెప్పాడు. దీనినే బృహత్కథామంజరిలో గుణాఢ్యుడు చెప్పాడు. కాని, మృచ్ఛకటికలో మొదటి శ్లోకాన్నిబట్టి శూద్రకుడు కల్పిత పురుషుడుగా కనబడుతున్నాడు. నాందీ ప్రస్తావనలో శూద్రకుడు అగ్నిప్రవేశం చేశాడని సూత్రధారునిచేత చెప్పించాడు. ఇది అసంభవం కదా! లేదా ఆయన మరణానంతరం ఆయన ప్రశస్తి తెలుపుతూ ఎవరైనా నాందిలో శ్లోకం కలిపి వుండవచ్చును.

" ఋగ్వేదం, సామవేదం, గణిత మధ, కలాం
వైశికీం, హస్తి శిక్షా,
జ్ఞాత్వా శర్వప్రసాదాద్వ్యపగత తిమిరే చక్షుషీ
చోపలభ్య
రాజానం వీక్ష పుత్రం పరమ సదుదయే నాశ్వ
మేధేన చేష్టా
లబ్ధ్వా చాయుః శతాబ్దం, దశదిన సహితం
శూద్రకోగ్నిం ప్రవిష్టః "

మృచ్ఛకటిక కర్తగా చెప్పబడిన శూద్రకుడు ఒక మహారాజు. ఈశ్వర ప్రసాదంవల్ల కంటిజబ్బును పోగొట్టుకున్నాడు. ఆయన ఋక్, సామ వేదాలలో పండితుడు. గజ శాస్త్రము, గణిత శాస్త్రము, ధనుశ్శాస్త్రాది విద్యలలోనూ వివిధ కళలలోను నేర్పరి.

యుద్ధప్రియుడు. పొరపాటుననైనా ఓటమి యెరుగడు. అరిగజములతో బాహు యుద్ధము చేయగలిగినంతటి బలశాలి. ఆ పరిజ్ఞానం ఆ రచనలో కనబడుతుంది. ఇతని కుమారుని పట్టాభిషిక్తుని చేశాడు. అశ్వమేధయాగం చేశాడు.

ఇతడు విక్రమాదిత్యునితో సమానమైన ప్రతిభ గలవాడు. ఇతని రాజధాని ' వర్థమాన ' నగరముగాని, శోభావతిగాని అయివుండాలి. కథా సరిత్సాగరంలో ఇతనిని మృత్యుముఖంనుండి తప్పించడానికి ఆత్మాహుతి చేసికొన్న ఒక బ్రాహ్మణుని త్యాగంవల్ల నూరేళ్ళు జీవించగలిగినట్లు తెలుస్తోంది.

పాశ్చాత్య పండితుల సిద్ధాంత ప్రకారం మృచ్ఛకటిక ఏక కర్తృకము కాదు. భాసుని చారుదత్తములో నాలుగు అంకములలో అక్కడక్కడ యిచ్చిన సూచనలనుబట్టి ఆ తరువాత వాడైన శూద్రకుడు కథను పెంచి వివిధములైన నూతన పాత్రలను సృష్టించి, పది అంకముల ప్రకరణముగా రూపొందించాడు.

ఒకరు వ్రాసి విడిచిన దానిని మరొకరు పూర్తిచేయడం అనేది లోకంలో వుంది. బాణుడు కాదంబరి కొంత వ్రాసి చనిపోతే అతని కుమారుడు పూర్తిచేశాడు. అలాగే దశ కుమార చరిత్ర. ఆ విధంగానే భాసుని కథననుసరిస్తూ కల్పనచేసి, విస్తృతపరచడం ఆక్షేపణీయం కాదు. భాసుడు 4 అంకములే వ్రాశాడు. దానిని పెంచి శూద్రకుడు వ్రాయడం జరిగింది. అందువల్ల ఇది గ్రంధ చౌర్యమనడానికి ఎట్టి అవకాశంలేదు.

వీర, శృంగార సన్నివేశములు, నీతి, దుర్జన లక్షణము, దుష్టపాలనము ఈ గ్రంధమునందు గల విషయములు.

రాజకీయ వాతావరణంలో సాంఘిక పరిస్థితులను తెలియజేస్తూ శృంగారాన్ని మేళవించి నిర్మించిన మహా నాటకం యిది. ఇది దశవిధ రూపకములలో ప్రకరణము అనే కోవకు చెందింది.

ఈ కవి స్వంత పద్ధతి నవలంబించి, మృచ్ఛకటికమునకు ఒక ప్రత్యేకమైన విలువను ప్రసాదించాడు.

కథానాయకుడు చారుదత్తుని ఆంతరంగిక విషయాలలో ఆ పట్నం యొక్క, రాజ్యం యొక్క దురదృష్టాన్ని మేళవించి జరిగిన కుట్ర, దాని పరిణామము చక్కని శోభ చేకూర్చింది. చారుదత్తుని శీలము, ఔదార్యము ఎన్నదగినది. తన స్నేహితుడైన విదూషకునియందు మైత్రి, భార్య ధూతాంబయందు గౌరవ, ప్రేమ, మర్యాదలు ; పుత్రుడైన రోహసేనునియందు గాఢమైన వాత్సల్యము, పితృప్రేమ ; వసంతసేన యందనురాగము ప్రదర్శింపబడ్డాయి.

నాయిక అయిన వసంతసేన గణిక. అయినా వృత్తియందు విముఖురాలు, సుగుణవంతురాలు.

ఆమె హృదయౌన్నత్యాన్ని చారుదత్త దంపతులు మాత్రమే గ్రహించారు. ఆమె యోగ్యతను చూసి తన సపత్నిగా స్వీకరించితే బాగుంటుందన్న ఆలోచన ధూతాంబకు కలిగినది.

చారుదత్తుడు దానమువల్ల, దరిద్రుడైనాడు. ఆతని కుమారుడు రోహసేనుడు మట్టి బండితో ఆడుకుంటుండడం చూసిన వసంతసేన దుఃఖాక్రాంత అయింది తన నగలన్నీ ఆ బండిలోవేసి బంగారు బండి చేయించుకుందుకు యిచ్చింది. " నా చెలికత్తె రదనిక చేయిస్తుంది " అంటుంది.

ఆ సంఘటన తీసుకొని తన నాటకమునకు ' మృచ్ఛకటిక ' మని నామకరణం చేశాడు.

ఈ నాటకంలో అప్రధానమైన 27 పాత్రలున్నాయి. అయినా వేటికవే తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకున్నాయి ఇటువంటిది భారతీయ నాటకములలో చాలా అరుదు. ★



# విద్యార్థులు భవనమునకు పునాదులవంటివారు

— శ్రీ సత్యసాయిబాబా

విద్యార్థులు భవనమునకు పునాదులవంటి వారు, వృక్షమునకు వేరువంటివారు. కనుక ఈ విద్యార్థి దశను దుర్వినియోగపరచకుండా, పవిత్రములైన భావములచేత దీనిని అభివృద్ధి గావించుకొన్నప్పుడే ఈ శాంతి భవనం చేత మన జీవితం ఆనందమయం చేసుకోవడానికి వీలపుతుంది.

## సాంకేతిక విజ్ఞానశాస్త్రం

ఈనాడు సాంకేతిక విజ్ఞానశాస్త్రం విరివిగా పెరుగుతున్నది. దీనివలన ప్రజలకు అనేక సౌకర్యములు, సదుపాయములు చేకూరుతున్నాయి. అయితే దీనివలన ఎంత ఉపకారం, లాభం చేకూరుతున్నదో అనేక రెట్లు నష్టములు, బాధలు, దుఃఖములు కూడా ఒక ప్రైపు పెరుగుతున్నాయి. ఈ సాంకేతిక విజ్ఞానంచేత ఉపకారం కంటె అపకారం అధికంగా పెరుగుతున్నది. ఈ సాంకేతిక శాస్త్రంలో దోషంలేదు. అయితే దీనివి వినియోగించుకొనే విధానంలో వివేక శూన్యం కావడంచేతనే ఈ అరిష్టాలు కలుగుతున్నాయి. విజ్ఞానంతోపాటు వివేకం వుండినప్పుడే ఈ సాంకేతిక శాస్త్రమును సద్వినియోగపరచుకోగలుగుతాం.

## దివ్యత్వాన్ని విస్మరిస్తున్నాం

ఇది నవీన నాగరిక యుగం. అయితే ఈ యుగం లోపల అనేక విధములైన అపశ్రుతులు చేరడం చేతనే మానవత్వంలోవున్న దివ్యత్వమును విస్మరిస్తున్నాం. సుఖ సంతోషాలతో, భోగాలతో జీవితాన్ని గడపాలని మానవుడు ఆశిస్తున్నాడు. అయితే ఈ తలంపులకు విరుద్ధంగా మానవుడు కష్టముల ననుభవిస్తున్నాడు. దీనికి కారణమేమిటో మానవుడు ఆలోచించ ప్రయత్నం చేయకుండా, విలాస జీవితంలోనే కాలాన్ని వృథా పరుస్తున్నాడు. జీవితం యొక్క సరైన విలువలను గుర్తించలేకపోతున్నాడు. ఈనాడు సినిమాలు, విమానాలు అధికమైనాయి; రేడియోలు, వీడియోలు పెరిగిపోయినాయి; టెలిగ్రాములు, టెలిఫోనులు పెరిగాయి. ఈ విధమైన సౌకర్యములు అధికం కావడంచేత మానవునికి విశ్రాంతి లేని స్థితి ఏర్పడింది. జీవిత వ్యయం విరివిగా పెరిగింది. జీవిత వ్యయాన్ని భరించలేక మానవుడు అనేక విధములైన తికమకలతో త్రోసుకు పోతున్నాడు. ఒకవైపు యుద్ధ భయం, మరొకవైపు కరువు కాటకాల భయం. ఒంటరిగా ఇంటిలో వుండటం భయం, బయటకుపోతే భయం. ఈ భయంతో కృంగిపోతున్నాడు మానవుడు. రక్షణ శూన్యమైపోయింది. ఆనందం అత్యంత దూరమైపోయింది. నిరాశ నిస్పృహలు తాండవిస్తున్నాయి. మానవుడు క్షణ క్షణమూ భయభ్రాంతులతో జీవితాన్ని గడుపుతున్నాడు. ఈ అన్నిటికీ మూలకారణం వివేకశూన్యమైన విజ్ఞాన శాస్త్రమే. అంతేకాదు ఆర్థికంగా వ్యయం పెరిగిపోవడమే. దీనివలన మానవుడు అన్యాయ, అక్రమ, అనాచార, అసత్యములచేత దారితప్పి నడుస్తున్నాడు.

## అవినీతి పెరగడానికి ?

ఆర్థికంగా వ్యయం పెరిగిపోవడమే అవినీతి పెరగడానికి మూల కారణం. మధ్య తరగతి ఉద్యోగులు ఆర్థిక భారానికి తట్టుకోలేకపోతున్నారు. తమ పిల్లలను చదివించుకోవడానికి చాలా శ్రమపడుతున్నారు. ఇంజనీరింగ్, మెడిసిన్ కోర్సులను చదివించాలంటె లక్షలు వ్యయం చేయవలసి వస్తున్నది. ప్రక్కింటి వున్నవారిని చూచి టి. వి. లు వీడియోలమీద మోజును పెంచుకొని భర్తలను వేధిస్తున్నారు. జీతం తక్కువ, ఇంటి ఖర్చు ఎక్కువ. భార్యాబిడ్డలను సంతోష పెట్టాలి. అప్పులు చేయవలసి వస్తున్నది. తీర్చడానికోసం అవినీతికి పాల్పడవలసి

వస్తున్నది. ఈ సాంకేతిక విజ్ఞానశాస్త్ర ప్రభావం మానవుణ్ణి పెడమార్గాన పట్టిస్తున్నది. తల్లిదండ్రులు ఎంతో శ్రమపడి తమ పిల్లలను ఏదో విధంగా మెడిసిన్, ఇంజనీరింగ్, లా లు చదివిస్తున్నారు. ఉత్తీర్ణులయిన తరువాత వారికి ఉద్యోగాలు దొరకడంలేదు. బ్యాంకులలో అప్పులుచేసి ప్రయివేటు ప్రాక్టీసులు పెడుతున్నారు. ప్రాక్టీస్ పెట్టాలంటే ఆడంబరం అధికంగా చూపించాలి. అప్పుచేసి పప్పుకూడన్నట్లుగా, బ్యాంకులలో అప్పుచేసి ఆడంబరంగా కార్లలో తిరుగుతున్నారు. ఇండ్లలో పస్తుంటూ కూడా భేషజంగా తిరుగుతున్నారు. ఈ ఖర్చును భరించడానికి నీతి నిజాయితీలకు తిలోదకాలిస్తున్నారు. రెండు మాత్రలతో నయమయ్యే జలుబు దగ్గు రోగాలను డాక్టర్లు పెంచివేస్తున్నారు. రోగి రోగం త్వరగా కుదురుతే డాక్టర్‌కు గిట్టుబాటు కాదు గదా! అదే విధంగా న్యాయవాదులు కూడా చిన్న చిన్న కేసులకోసం నెలల తరబడి కోర్టుల చుట్టూ పార్టీలను త్రిప్పి డబ్బు గుంజుతుంటారు. రోగమును పెంచకపోతే డాక్టరుకు కడుపు నిండదు. కేసులను వాయిదాలు వేయించకపోతే లాయర్లకు ఫీజు రాదు. ఆంధ్రలో ఒక సామెత వుంది. "ప్రక్కింట్లో గొల్లుమంటే, డాక్టర్ చేతిలో ఘల్లుమంటుంది". కనుక ఈ సాంకేతిక విజ్ఞానశాస్త్రం వలన ఏవిధములైన యిబ్బందులు అధికములైపోతున్నాయో మీరు అర్థం చేసుకొనవచ్చును.

## నీతి నిజాయితీలు

మానవునియందు నీతి నిజాయితీలు శూన్యమై పోతున్నాయి. ఈ నీతి నిజాయితీలు లేకపోతే మానవుడే కాదు. విద్యార్థులు ఈ సత్యాన్ని గుర్తించి నీతి నిజాయితీలతో జీవితాన్ని గడపాలి. ఉద్యోగ నిమిత్తమై విద్యను నేర్చుకుంటున్నామనే భావనను దూరం చేసుకోండి. జ్ఞాన సముపార్జన నిమిత్తమై చదువుతున్నామనే సత్యాన్ని గుర్తించండి. మన జీవితం పరోపకారంకోసం వినియోగపడాలి. సోదర మానవులను ప్రేమతో చూడాలి. మిమ్మలను కని పెంచి అభివృద్ధిగావించినటువంటి తల్లిదండ్రులను ప్రేమించాలి. "కన్నతల్లి ప్రేమ కన్న మించిన దేది? జన్మభూమి కన్న స్వర్గమేది?" తాము పస్తుండి మా బిడ్డలు అభివృద్ధిలోనికి రావాలని ఎంతమంది తల్లిదండ్రులు ఎన్ని అవస్థలకు గురి అవుతున్నారో ఆలోచించండి. "మాతృదేవోభవ! పితృదేవోభవ!" అని మాతా పితరులను పూజించి ఆనందింపజేయండి! విద్యార్థులారా! విద్యా విషయములయందు గాని, వైజ్ఞానిక విషయములయందుగాని, మీరు వెనుకబడినచో మీ తల్లి ఎంత ఆవేదన చెందుతుందో; నైతికంగా, ఆధ్యాత్మికంగా వెనుకబడిన బిడ్డలను చూచి భరతమాత అంతకు వెయ్యిరెట్లు ఆవేదన చెందుతుంది. వారి ఆవేదనను నిర్మూలనంచేసి, ఆనందమును చేకూర్చే బాధ్యత విద్యార్థులది. ఈ జననీ, జన్మభూమి రెంటియొక్క తత్వాన్ని చక్కగా గుర్తించినటువంటి వ్యక్తియే సరైన విద్యార్థి.

## విద్య లక్ష్యం

జాతియొక్క సమతత్వాన్ని, దేశ సమగ్రతను కాపాడి, ప్రచార ప్రబోధనల ద్వారా శాంతి భద్రతలను అందించడమే విద్య లక్ష్యం. ఇట్టి పవిత్రమైనటువంటి విద్యను గరిపి, వారిని తిరిగి గృహస్థాశ్రమంలో పంపేటటువంటి సమయంలో పవిత్రమైన బోధనలను చేయడానికి ఏర్పాటు చేసిన సమావేశమునకు స్నాతకోత్సవ మంటారు. ఈ గురుకులంలో విద్యను గరిపేటటువంటి సమయమున పవిత్రమైన, ప్రశాంతమైన, నిర్మలమైన, నిస్వార్థమైన తత్వాన్ని అభివృద్ధిపరచుకొని జీవితమును సార్థకం చేసుకోవాలి. గృహస్థ, వానప్రస్థ, సన్యాస ఆశ్రమములనేటటువంటి మూడు ఆశ్రమములు బ్రహ్మచర్య ఆశ్రమం పైననే ఆధారపడి వుంటాయి. పై మూడు ఆశ్రమములకు ఇది పునాది వంటిది. కనుక ఈ విద్యార్థి దశను సద్వినియోగం చేసుకోవాలి.

## సంస్కారణ

ఈనాడు ఎవరు ఉన్నత ఉద్యోగాలలో, అధికార పదవులలో వున్నారో, రాజకీయంగా నాయకత్వం

వహిస్తున్నారో—వీరందరూ ఒకనాటి విద్యార్థులే. ఈనాటి విద్యార్థులే రేపటిపౌరులు, రేపటి అధికారులు, రేపటి నాయకులు. ఈ సత్యమును మరువరాదు. దేశమంటే మానవులే. దేశమును తీర్చిదిద్దటమంటే మానవులను తీర్చిదిద్దటమే. మానవులను తీర్చిదిద్దటమంటే ఏమిటి ? నైతికంగా, ధార్మికంగా వారిని సంస్కరింపజేయడమే మన ప్రధాన కర్తవ్యం. సంస్కరణ అనగా మన నిత్యజీవితంలోనున్న దోషములను నిర్మూలనం గావించి ; పవిత్రతను, సద్భావనలను అభివృద్ధి గావించుకోవడమే 'సంస్కరణ'. జీవితం సంస్కారములపైననే ఆధారపడి వుంటుంది. ధాన్యంపై పొట్టును తొలగించకుండా అన్నం వండలేము గదా ! అదే విధముగా ప్రత్తిని వడికి, దారం చేసిన తరువాతనే గదా వస్త్రం తయారయ్యేది. భూమిలో దొరికిన ముడి బంగారు ఖనిజమును సంస్కరించి నప్పుడే గదా అది అపరంజిగా రూపొందేది. వీనినే సంస్కరణ అంటారు. ప్రాథమిక సంస్కరణ లనగా మన నిత్యజీవితంలో వున్నటువంటి దురభ్యాసములను, దుర్భావనలను, దుశ్చేష్టలను, దుశ్చింతనలను దూరం గావించుకొని సద్భావనలు, సదభిప్రాయములు, సత్ప్రవర్తనలను పోషించుకోవడానికి ప్రయత్నించాలి. ఐతే ఈనాడు ప్రజలను ఆస్తికంగాగాని, ఆధ్యాత్మికంగాగాని, నైతికంగాగాని సంస్కరించే శక్తి ప్రభుత్వానికి లేదు. ప్రభుత్వమును సంస్కరించే శక్తి ప్రజలలో లేదు. ఆధ్యాత్మిక దృష్టితో చూచినప్పుడు ఇటు ప్రభుత్వానికి గాని, అటు ప్రజలకుగాని సంస్కరింపజేసేటటువంటి శక్తి సామర్థ్యములు లేకపోవడంచేతనే ఈనాడు విద్యార్థులు ఇట్టి పవిత్రములైన సంస్కారములను పోషించుకోవడానికి, అభివృద్ధిగావించుకోవడానికి తగిన కృషి చేయాలి. ఈ బాల్యస్థితి యందే తమ జీవితమును చక్కగా దిద్దుకోవడానికి ప్రయత్నించాలి. భావిజీవితంలో ఉత్తమమైన పౌరుడుగా తయారుకావడానికి అవసరమైన మంచి అభ్యాసములను అలవరచుకొని, పోషించుకోవడానికి ఇప్పటినుంచే ప్రయత్నించాలి.

## అనుకరణ

సత్యవర్తన, ధర్మము, శాంతి గుణములచేత వర్థిల్లేటటువంటి విద్యార్థులుగా మీరు తయారుకావాలి. కేవలం విదేశీ సంస్కృతినిగాని, అనుకరణగాని ఏమాత్రం పాటించరాదు. భారతీయ శాస్త్రములు మహా పవిత్రములైనవి, దివ్యమైనవి, ప్రకాశమైనవి. ఇలాంటి విలువైన బంగారం మనకున్నప్పుడు, ఇతరులనుంచి మనం ఎందుకు ఆశించాలి.

కోరిన ఫలమిచ్చు కల్పవృక్షంబుండ
పెరటి పుష్పమునకై ప్రీతి ఏల
అడిగిన పాలిచ్చు కామధేనువె రాగ
ధరనిచ్చి ఆవును కొనగ నేల
పట్టుకాంతితో మేరుపర్వతముండ
వెండి బంగారుకై వెతకనేల
భక్తి, ముక్తి, భుక్తులనిచ్చేడి పరమాత్మయే
నుండ
పాడు చదువులనేల కోరనేల ?

వినయ విధేయతలే చదువుల సారం. విద్యయందు వినయమే లేకపోతే వాడు విద్యార్థే కాడు. మూర్ఖుడుగా తయారవుతాడు. కనుక విద్యార్థులందరు కూడను ఆదర్శమైన విద్యార్థులుగా, ఆనంద జీవితాన్ని గడిపి, సుఖశాంతులను ఇతరులకు యిచ్చేటటువంటి వారుగా రూపొందాలి.

## క్రమశిక్షణ

మన విద్యా సంస్థయందు ప్రధానం క్రమశిక్షణ. క్రమశిక్షణ అనేది కేవలం మన విద్యా సంస్థలో విద్యనభ్యసించేంతవరకే పాటించేదే కాదు. మీరు ఎక్కడికి వెళ్ళినా మీ నీడ మిమ్ము వెంటాడినట్లుగా ఈ క్రమశిక్షణ మిమ్ము వెంటాడాలి. ఈ క్రమశిక్షణే లేకపోతే మానవుడు పశువుగా మారుతాడు. పశుపతిగా మారాలిగాని పశువుగా మారరాదు. ప్రపంచంలో ఎన్నో విశ్వవిద్యాలయము లుండగా, మనం ప్రత్యేకంగా ఈ విశ్వవిద్యాలయమును

## ఆధ్యాత్మిక సాధన

"దైవము ఎప్పుడు లభిస్తాడు ? కర్మను అధిగమించినపుడు మాత్రమే. కర్మ చేయకుండగ విడిచిపెట్టడం కర్మను అధిగమించడము కాదు. కర్మను చేస్తూనే దానితో తాదాత్మ్యలేని స్థితిని నీవు అలవరచుకోవడం ద్వారా నీవు కర్మను అధిగమించిన వాడవవుతావు. మనం చేయవలసిన విద్యుక్త ధర్మాన్ని మనం నిర్వర్తిస్తూ, ప్రతి పనిలోను భగవంతుడు ఉన్నాడు అనే భావన పెంపొందింప చేసుకొని మనం ఏ పనిని చేసినా ఆ పని పదిమందికి వినియోగపడే విధముగ చేయగలిగితే ఆధ్యాత్మిక సాధన చేసినటువంటి వారము అవుతాము."

— శ్రీ మెహర్ బాబా

స్థాపించవలసిన అవసరం ఏమిటో మీరు గుర్తించాలి. కేవలం విద్యను మాత్రమే అభ్యసించడం కాదు. విద్యతోపాటు వినయ విధేయతలను, వివేక విజ్ఞానాదులను పోషించడానికి, దేశానికి ఆదర్శాన్ని అందించడానికి అవసరమైన వీరులను తయారుచేయడమే మా ఉద్దేశ్యము. అలాంటి విద్యార్థులు తయారుకావాలని ఆనాటినుంచి నేటి వరకును నేను ఎదురు చూస్తున్నాను.

వెతుకుచున్నాను నేను వెతుకుచునే యున్నాను  
వెతుకుచుంటి నాడు నేడు నిజమారయధర్మపరుని  
కొదవలేదు నరులకు నన్నూరు కోట్లు వున్నారు  
నరుని రూపములే చూచితి నిజరూపము కాంచనైతి  
బూరుగకాయలు చూచి మామిడియని భ్రమసినట్లు  
వెఱ్ఱి చెరుకు చూచి చెరకని తా నమలినట్లు  
కనికిరాళ్ళ రూపము చూచి కలకండని భ్రమసినట్లు  
రూపు చూచి మోసపోవు గుణమే యిది నరునిరూపు.

వేసుకుందురు విషమైన విత్తనములు  
ఆశపడుదురు మీరు అతిరుచ్య ఫలములు  
కాచిన కడు చేదు కాయలు తినలేక  
దోషము దేవునిపై త్రోసి వాదింతురు.

సర్పమింటియందు సంచరించుచునుండ  
ఎవరు సుఖనిద్ర చెందగలరు ?  
విషయ సర్పముండు విషమయదేహాన  
జీవయాత్ర దేహి సల్పుచుండు.

కేవలం ఆకారం మానవుడు కాదు. గుణ మానవుడు కావాలి. కనుక గుణాన్ని పెంచుకునే విద్యార్థులుగా తయారుకావాలని నేను కోరుతున్నాను.

### విద్యార్థులారా !

విద్యార్థుల తత్వాన్ని అర్థంచేసుకోవాలి. ఈ అర్థం చేసుకున్నదానిని ఆచరణలో పెట్టాలి. ఆచరణలో పెట్టినటువంటి దానిని హృదయానికి హత్తుకొనేటట్లుగా అనుభవించాలి. అనుభవించిన ఆనందమును పరులకు పంచాలి. కనుక మితిమీరిన కోరికలను అదుపులో వుంచుకొని, అవసరమైన దానినే పెంచుకొని, చెడ్డ కోరికలను దూరం చేసుకొని మొదట మీ ఇంటిని సరిదిద్దుకోవాలి. తల్లిదండ్రులను ప్రసన్నం గావించుకోవాలి. తల్లిదండ్రులకు మీరు దుఃఖము నిచ్చిరా ! మీ జీవితం పూర్తిగా దుఃఖంతోనే మునిగిపోతుంది. ఈనాడు మీ తల్లిదండ్రులకు ఎంత ఆనందాన్ని అందిస్తారో, రేపు మీ బిడ్డలు అంత ఆనందాన్ని మీకు అందిస్తారు. కాని ఈనాడు మేము విద్యార్థులమనే అహంకారంచేత తల్లిదండ్రులను లక్ష్యం చేయడంలేదు. ఇది ఏమాత్రం మంచిది కాదు. కనుక "మాతృదేవో భవ ! పితృదేవోభవ ! ఆచార్యదేవోభవ ! అతిథిదేవోభవ !— ఈ నాల్గింటిని శ్రద్ధగా ఆచరించి, ఆనందించి, దేశానికి మంచి ఆదర్శమును అందించాలని కోరుతున్నాను, ఆశిస్తున్నాను.

( ది. 22-11-1986న ప్రశాంతినిలయం పూర్ణచంద్ర ఆడిటోరియంలో శ్రీ సత్యసాయి ఇనిస్టిట్యూట్ ఆఫ్ హయ్యర్ లెరనింగ్ పంచమ స్నాతకోత్సవ సభలో ఛాన్సలర్ భగవాన్ శ్రీ సత్యసాయిబాబాగారు చేసిన ప్రసంగం )